# మీ పిల్లలకు విజ్ఞానం కలగాలంటే - చదివించండి...

# చిల్డ్రన్స్ నాలెడ్జ్ బ్యాంక్ Vol. I

బాలలు ఆలోచించనారంభించినప్పుడే వారిలో కుతూహలం పెరిగి తమ చుట్టూ ఉన్న సుందర ప్రపంచం గురించి "ఎందుకు ? ఏమిటి ? ఎలా ?" అన్న ప్రశ్నలు వారి మెదడును దొలిచివేస్తాయి. ఆ సమయంలో వారికి సమాధానం లభిస్తే వారికి ఉత్తేజం కలుగుతుంది. వారి మెదడు మరింత చురుకవుతుంది. దాంతో పిల్లలకు మానసికవికాసం కలుగుతుంది. ఆ మనోవికాసాన్ని కలిగించేదే—

**చిల్డ్రన్స్ నాలెడ్జ్ బ్యాంక్ Vol. I**

ఈ భాగంలో సుమారు 200 ప్రశ్నలు ఉన్నాయి. ఈ క్రింది భాషలలో కూడా లభ్యము—

ఇంగ్లీషు, హిందీ లలో Vol. I, II, III.




Vol. II in press

పెద్ద సైజు
232 పేజీలు
వెల : రూ. 20/-
తపాలా ఖర్చు 4/-

ఉదాహరణకు, ఈ మొదటి భాగంలో ఉన్న కొన్ని ప్రశ్నల జాబితా—

* దెయ్యాలున్నాయా ? * ప్లాస్టిక్ సర్జరీ అంటే ఏమిటి ? * స్త్రీలకు గెడ్డం ఎందుకు పెరగదు ? * నిజంగా రాక్షసాకారులు ఉన్నారా ? * మౌంట్ ఎవరెస్టుకు ఆ పేరు ఎలావచ్చింది ? * వ్యంగ్యచిత్రాలు ఎలా ప్రారంభమయ్యాయి ? * సరోవరాలు ఎలా ఏర్పడతాయి ? * సముద్రాలు ఎలా ఏర్పడ్డాయి ? * శనిగ్రహం చుట్టూ ఉన్న వలయాలు ఏమిటి ? * మనతో చంద్రుడు ఎందుకు పయనిస్తాడు ? * పిరమిడ్లు అంటే ఏమిటి ? * సూర్యగ్రహణం ఎలా ఏర్పడుతుంది ? * ఇంద్ర ధనుస్సు ఎలా ఏర్పడుతుంది ? * చైనాలోని పెద్ద గోడను ఎప్పుడు నిర్మించారు? * సూర్యునిలోని వేడి ఎంత ? * పెన్సిలును ఎప్పుడు కనుగొన్నారు? * భూమ్యాకర్షణశక్తి అంటే ఏమిటి ? * మృతసాగరం అంటే ఏమిటి? * గ్లేసియర్స్ అంటే ఏమిటి?




తమిళం, కన్నడం, బెంగాలీ, గుజరాతి, మరాఠీలలో Vol. I

**Price same**

**From the makers of**
**Rapidex English Speaking Course**

భారతదేశంలోని పెద్ద బుక్ స్టాల్స్‌లోను, ఎ.హెచ్. వీలర్స్, హిగిన్‌బాదమ్స్, రైల్వే బుక్‌స్టాల్స్‌లోను దొరుకుతుంది. లేక వి.పి.పి. కొరకు రాయండి—



**PUSTAK MAHAL**
**Khari Baoli, Delhi-110006**

Netaji Subhash Marg, New Delhi

Vandana/PM/Tel-5



# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**
**కేమెల్**
1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name: .................................................. Age: ..................

Address: ..................................................

..................................................

**CONTEST NO32**

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''ఓటమికి కారణం'']కు ఆధారం ''వసుంధర'' రచన.

అధికార నిర్వహణ అనేది ఎంతో బాధ్యతతో కూడినపని. ఏ కారణంవల్లనైనా అల్పుడికి అధికారం సంక్రమిస్తే, జరగబోయే కీడును గురించి చాలా ప్రాచీన సూక్తులున్నవి. ''అధికార దుర్విని యోగం'' అన్న కథలో అలాంటి ఒక అధికారి దుష్ట ప్రవర్తన చక్కగా వివరించబడింది.

## అమరవాణి

అతీత్య స్వార్హతాం కోపి, లభతే నాధికం ఫలమ్,
స్వల్పమేవాంబు లభతే, ప్రస్థః ప్రాప్యాపి సాగరమ్.

[ఏ మనిషికీ తన అర్హతకు మించిన ఫలం లభ్యం కాదు. కడవ మహాసముద్రం దగ్గిరకు పోయినా, దానికి లభించేది కడవ నీరే; ఎక్కువ రాదు.]

సంపుటి 73 సెప్టెంబర్ '83 సంచిక 3

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు




## జంతు స్వరసేకరణ

మాస్కో విశ్వవిద్యాలయంలోని జీవశాస్త్రం విభాగం ఇటీవల మూడు వేలకు మించిన జంతుస్వరాలను రికార్డు చేసి భద్రపరిచింది. పక్షులు, జంతువులు, క్రిమికీటకాలతోసహా సర్వప్రాణికోటి స్వరాలసేకరణవల్ల ప్రయోజనం ఏమిటి? నిద్ర లేకుండా బాధపడే రోగులకు చికిత్స చేసేప్పుడు ఈ జంతు, పక్షి స్వరాలు చాలా ఉపయోగపడుతున్నాయని వైద్యవేత్తలు చెబుతున్నారు. ఈ స్వరాలు, శబ్దాలు మనిషి మెదడును ఎంతగానో ప్రభావితం చేస్తాయని వీరు అభిప్రాయపడుతున్నారు.

## తరుగుతూన్న సూర్యగోళం!



సూర్యగోళం తన జ్వలనం కోసం ఒక సెకండుకు తన నుంచి ఇంచు మించు నలభైలక్షల టన్నుల పదార్థాన్ని ఉపయోగించుకుంటుందని ఒక పరిశోధనవల్ల తెలియవచ్చింది. దీనివల్ల సూర్యగోళానికి అంతం సమీపిస్తోందా అంటే లేదు. ఎందుకంటే ఈ లెక్కన, వచ్చే ఆరు లక్షల కోట్ల సంవత్సరాలలో సూర్యగోళం స్వాహాచేసేది దానిలోని నూటనలభై వెయ్యోవంతు పదార్థాన్ని మాత్రమే!

## పాప పుట్టింది!



పాపపుట్టడం ఒక విశేషమా? అవును, ఆ పాప ఏ యువరాజో యువరాణో అయితే విశేషమేమరి! కాని ఈ పాప ఆ కోవకు చెందింది కూడా కాదు. నిజానికి ఈ పాప తల్లితండ్రుల పేర్లు కూడా తెలియదు. అయితే ఇందులో విశేషం ఏమిటి? అండమాన్ దీవిలోని చిన్న చిన్న అడవుల్లో, గూళ్ళవంటి గుడిసెలు వేసుకుని నివసించే ఓన్‌జెస్ అనే ఆటవికతెగ క్రమంగా నిర్మూలమైపోతోందని చెబుతున్నారు. ఆ తెగవారు ఇంతవరకు వున్నది మొత్తం తొంభైయేడుమంది; ఇప్పుడు పుట్టిన పాపతో కలిసి తొంభైఎనిమిదిమంది మాత్రమే!

## మీకు తెలుసా?

1. భారతదేశానికి వచ్చిన తొలి గ్రీకురాయబారి ఎవరు? ఆ రాయబారిని పంపిన గ్రీకురాజు పేరేమిటి?
2. భారతదేశాన్ని జయించాలని ప్రయత్నించి విఫలుడైన పర్షియారాజు పేరేమిటి?
3. భారతభూభాగాన్ని కొంత తన రాజ్యంలో కలుపుకున్న పర్షియారాజు ఎవరు?
4. తూర్పు సముద్రతీరంలో ఈస్టిండియా కంపెనీ నిర్మించిన రెండు కోటలు ఏవి?
5. వీరాధివీరుడుగా చరిత్రప్రసిద్ధిగాంచిన ఒక రాజుకు పిల్లులంటే తగనిభయం. ఆ రాజు ఎవరో మీకు తెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)




రఘువీరు డనే వాడు ఒక జమీందారు ఇంట్లో, ఆయనకు చేదోడు వాదోడుగా వుంటూ, ఆయన యిచ్చేదానిమీద జీవిస్తు న్నాడు. అయితే, జమీందారు దగ్గిర జీవితం అతడికి కత్తిమీద సాములావున్నది.

కావడానికి జమీందారు చాలా మంచి వాడు. రఘువీరుడి కుటుంబాన్ని ఆయన సొంతకుటుంబంలా చూసుకుంటున్నాడు. అన్నీ బాగానే వున్నాయి! కాని, జమీందారు నిదానంలో కూడా మరీ అతి నిదానం మనిషి. మీద పిడుగు పడిపోతున్నా, తను నిమ్మకు నీరెత్తినట్టు వుంటాడు. అలాగని ఏదీ పట్టించుకోకుండా వుండడు. ఆయనకు అన్ని వ్యవహారాలూ కావాలి.

ఆ ఊళ్ళో సోమయ్యా అనే రైతు కూతురు పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి పందిళ్ళు తను వేయిస్తానని జమీందారు, సోమయ్యకు చెప్పాడు. పెళ్ళిరోజు దగ్గిర పడుతున్నదనగా సోమయ్య, రఘువీరుడి చుట్టూ తిరగసాగాడు. రఘువీరుడు, జమీందారుకు యీ సంగతి చెబితే ఆయన, పట్టించుకోకుండా, ''తొందరేముందిరా, ఇంకా పెళ్ళికి వ్యవధి వుందిగదా!'' అనసాగాడు.

చివరకి పెళ్ళిపందిళ్ళు, మగపెళ్ళి వారు ఆ ఊరు తరలి వచ్చాక, వాళ్ళ కళ్ళ ముందే వేయించడం జరిగింది. మగ పెళ్ళివారు చాలా గింజుకుని, సోమయ్యను నానామాటలూ అన్నారు.

సోమయ్య వాళ్ళకు జరిగింది చెప్పుకుని, ''మా జమీందారుగారి మాట కాదని, నా అంతట నేనే పందిళ్ళు వేయిస్తే, యిక ఊళ్ళో బతకలేను. అయినా. ఆయన చాలా మంచివాడు. ఎటొచ్చీ రఘువీరుడనేవాడు ఆయన వ్యవహారాలన్నీ చూస్తూంటాడు. దేవుడు వరమిచ్చినా

జొన్నలగడ్డ రామలక్ష్మి



పూజారి వరమివ్వడన్నట్టు, వాడు అన్నింటికీ ఆలస్యం చేస్తూంటాడు,'' అన్నాడు.

తప్పు జమీందారుదే అని తెలిసినా, ఎవరూ ఆ మాట పైకి అనలేరు. అలాంటి వారంతా రఘువీరుడి మీద తమ అక్కసు తీర్చుకుంటూండే వారు. ఇది, రఘువీరుడికి చాలా బాధగావుండేది.

కాని, రఘువీరుడి కారణంగా తన పరువు నిలబడుతున్నదని, జమీందారుకు తెలుసు. అందువల్ల ఆయన వాణ్ణి ఆత్మీయుడిలా చూసుకునేవాడు.

ఒకసారి ఆ దేశపురాజు పారుగుగ్రామం మీదుగా వేటకు వెళుతున్నట్టు తెలిసింది. జమీందారు వెంటనే రఘువీరుడితో, రాజుగారికి తమ గ్రామంలో విడిది ఏర్పాటు చేయమని చెప్పాడు.

''వద్దు, బాబూ, మహారాజు పరమ కోపిష్టి అని విన్నాను. ఏర్పాట్లలో ఏలోటు జరిగినా మనకు ఉరిశిక్ష తప్పదు,'' అన్నాడు రఘువీరుడు భయపడిపోతూ.

''మన ఏర్పాట్లలో, లోట్లెందుకు జరుగుతాయి?'' అన్నాడు జమీందారు కోపంగా.

రఘువీరుడు మాట్లాడ లేదు.

మహారాజుకు కబురు వెళ్ళింది. ఆయన సంతోషంగా అంగీకరించాడు. వేటనుంచి తిరిగి వచ్చేటప్పుడు జమీందారు గ్రామంలో బసచేస్తానన్నాడు. రఘువీరుడి గుండెల్లో రాయిపడింది.

జమీందారుకు ఒక బావమరిది వున్నాడు. రాజును తమ ఊరికి ఆహ్వానించడం, కొరివితో తలగోక్కున్నట్లే, అని అతడికి తెలుసు. అతను ముందుగానే రాజుగారి అనుచరుల్లో కొందరిని మంచి చేసుకున్నాడు. వాళ్ళతో తనబావ ఏపనైనా రఘువీరుడనే వాడికి అప్పగిస్తాడనీ, ఏర్పాట్లలో ఏదైనా లోటుపాటు జరిగితే, అవి వాడు బుద్ధిపూర్వకంగా చేసేవే అనీ చెప్పాడు. ఈ విషయం వీలుదొరికినప్పుడు రాజుగారితో చెప్పమన్నాడు. వాళ్ళు సరేనన్నారు.

ఈ సంగతి రఘువీరుడికి తెలియదు. జమీందారు నిదానగుణంలో ఏమార్పూ రాలేదు. రాజు రావలసిన రోజుకు, ఆయన విశ్రాంతి భవనంలో ఏర్పాట్లింకా పూర్తి కాలేదు. అయితే, వేటలో రాజు గాయపడడం వల్ల, ఒక రోజు ఆలస్యంగా వచ్చాడు. ఆ లోటు అలా తీరిపోయింది. విశ్రాంతి భవనంలోని చక్కని సౌకర్యాలు చూసి రాజు చాలా సంతోషించాడు.

రాజు, రాత్రికి తనకేమేం వంటకాలు కావాలో జమీందారుకు చెప్పాడు. ఆయన అంతా శ్రద్ధగా విని తన వంట వాడికి చెప్పాడు. వాడు వంటగదికి వెళ్ళి, కొంత సేపటి తరవాత తిరిగివచ్చి, "కూరల్లో రాజుగారు కుంకుమపువ్వు వాడమన్నారు. అదిలేదు. వెంటనే తెప్పించండి," అని చెప్పాడు.

ఈ విషయం జమీందారు రఘువీరుడికి రాత్రి అయ్యాక చెప్పాడు. వాడు ఊళ్ళో విచారించగా, ఆ కుంకుమపువ్వు పొరుగూరిలో వున్న పెద్ద దుకాణంలో తప్ప మరెక్కడా దొరకదని తెలిసింది. రాజుగారి భోజనసమయం కావస్తున్నది.

ఈ లోగా రాజు, జమీందారుకు కబురు పెట్టి, "నేను వేటలో కొద్దిగా గాయపడిన కారణంగా, వైద్యులు కుంకుమపువ్వు వాడరాదంటున్నారు. మీరిప్పటికే పదార్థాలూ అవీ చేయించి వుంటే, నా కోసం మళ్ళీ వంట చేయించండి. కొంచెం ఆలస్యం అయినా ఫరవాలేదు," అన్నాడు.



ఈ వార్త రఘువీరుడికి తెలిసింది. అతడి గుండె తేలికపడింది. అసలు కుంకుమపువ్వు లేకుండానే వంట పూర్తి కావడం వల్ల, రాజుకు సకాలంలోనే భోజనం వడ్డించబడింది. రాజు ఆశ్చర్యపోయాడు. భోజనం ఆలస్యం కానందుకాయన జమీందారును మెచ్చుకున్నాడు.

మర్నాడు రాజు తనకు జరిగిన ఆతిథ్య విషయంలో ఎంతో తృప్తిచెంది, ఆ గ్రామానికి ఎన్నో సదుపాయాలు కలగజేస్తానని వాగ్దానం చేశాడు. అంతేకాక,

గ్రామపెద్దలందరి ముందూ రఘువీరుణ్ణి పిలిచి, "నీ గురించి విన్నాను. నీ వంటి సమర్థుడు దొరికిన యీ జమీందారూ, గ్రామస్థులూ చాలా అదృష్టవంతులు," అంటూ మెచ్చుకున్నాడు.

రాజు వెళ్ళిపోయాక ఊళ్లో రఘువీరుడి పరపతి పెరిగిపోయింది. అతడు మహా రాజు అభిమానానికి పాత్రుడయ్యాడని తెలిసి, అంతా అతణ్ణి గౌరవించసాగారు.

జమీందారు కూడా రఘువీరుడి చేతులు పట్టుకుని, "ఇంతకాలం నిన్ను కన్న కొడుకులా భావించాను. కానీ, యీ రోజు నుంచీ నువ్వు నిజంగా, నా కన్న కొడుకువే!" అన్నాడు.

ఆ మాటకు రఘువీరుడు సంతోషించకపోగా, ఎంతో బాధతో, "నే నిక మీ దగ్గిర వుండదలచ లేదు. ఏ పట్నమో పోయి స్వతంత్రంగా బతుకుతాను. రాజంతటి వాడు వచ్చినా మీరు, మీ అతి నిదాన స్వభావం మార్చుకోలేదు. ఆ కుంకుమపువ్వు విషయంలో ఏ దైవశక్తో మనల్ని కాపాడింది. రాజుగారు మన ఆతిథ్యానికి పూర్తిగా తృప్తి చెందాడు. ఇందువల్ల మీలో నిదానగుణం మరింతగా పెరిగిపోతుంది. మీరు యిక్కడికి ఏ చక్రవర్తినో ఆహ్వానించినా ఆహ్వానించ వచ్చు. అప్పుడు జరగబోయేదేమిటో, నేనూహించగలను," అన్నాడు.

ఆ జవాబుకు జమీందారు పెద్దగా నవ్వి, "గ్రామ పెద్దలందరి ఎదుటా రాజుగారు ఆతిథ్యం యిచ్చిన నన్ను కాక, నిన్ను ఎందుకు మెచ్చుకున్నా రనుకున్నావు? ఆయన అనుచరులు నన్ను గురించీ, రాత్రి జరిగిన దాన్ని గురించీ — సర్వం ఆయనకు చెప్పేశారు. వెళ్ళే ముందు ఆయన, నా అతినిదానం విషయమై చాలా గట్టిగా హెచ్చరించాడు, తెలిసిందా? రాజంతటివాడి హెచ్చరికనే పాటించక పోతే జమీందారీకే ముప్పు, అర్థమైందా?" అన్నాడు. రఘువీరుడు అర్థమయిందన్నట్టు చాలా సంతోషంగా తలాడించాడు.






## 5

[పద్మపాదుడు; పింగళుణ్ణి, భల్లూకకేతుడి మాయలో పడకుండా రక్షించిన తరవాత–యిద్దరూ కలిసి, భల్లూక పర్వతాలకు బయలుదేరారు. దారిలో వాళ్ళకు పొగల రూపంలో కదిలే పిశాచాలు కనిపించినై. మొసళ్ళ రూపంలోవున్న మహామాయుడి శిష్యులు, పద్మపాదుడికి సహాయం చేసేందుకు అంగీకరించి అదృశ్యులైపోయారు. తరవాత—]

మహామాయుడి శిష్యులిద్దరూ అదృశ్యులై పోగానే, పింగళుడు ఆశ్చర్యపడుతూ, పద్మపాదుడి కేసి చూసి, "పద్మపాదా! ఆ ఇద్దరూ తిరిగి మొసళ్ళ రూపంలో ఈ నదిలో ప్రవేశించలేదు గదా?" అని అడిగాడు.

"మొసళ్ళ రూపంలోనా?" అంటూ పద్మపాదుడు ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకుని నవ్వుతూ, "పింగళా, వాళ్ళిద్దరూ నిజంగా మళ్ళీ మొసళ్ళ రూపం ధరిస్తే, కథ మొదటికి వస్తుంది. వాళ్ళను చేజిక్కించుకునేందుకు నా సోదరులిద్దరూ అహుతి అయిన సంగతి నీకు తెలుసు గదా? నేను కూడా వారి బారి నుంచి కొసప్రాణాలతో బతికి బయట పడ్డాను," అన్నాడు.

"అయితే, వాళ్ళిప్పుడు ఎక్కడికి వెళ్ళినట్టు?" అని ప్రశ్నించాడు పింగళుడు.




"వాళ్ళు ఎక్కడికి ఏ రూపంలో వెళ్ళారనేది అంత ముఖ్యం కాదు. మనం ఈ నదీ గర్భంలో ఉన్న పాడుపడిన దేవళంలో ప్రవేశించవలసి వుంది. ఆ దేవళంలో గల అయిదు ద్వారాలను తెరుచుకుంటే తప్ప, మనం మహామాయుడు సమాధి అయివున్న గదిని చేరలేము. అందుకు వాళ్ళు మనకు సహాయం చేస్తారు," అన్నాడు పద్మపాదుడు.

"నాకు అంత బాగా ఈత రాదు. ఈ నదిలో వున్న దేవాలయాన్ని నే నెలా చేరగలను?" అన్నాడు పింగళుడు.

పింగళుడు అమాయకంగా అడిగిన ఈ ప్రశ్నకు పద్మపాదుడు నవ్వి, "పింగళా, నీకు ఈదటం చేతకాకపోయినా, తిరుగులేని గుండెనిబ్బరం వుంటేచాలు! ముందు ఈ నదిలో ఒక్క చుక్క నీరు కూడా లేకుండా చేయవలసి వుంది. అందుకు ప్రయత్నిద్దాం. ఆ ప్రయత్నంలో మనకు మహామాయుడి శిష్యులు తప్పక సహాయం చేసారు," అన్నాడు.

"ఇంత గొప్పనదిలో— ఒక్క నీటిచుక్క కూడా లేకుండా చేయటమా?" అంటూ పింగళుడు ఆశ్చర్యం కనబరిచాడు.

"అవును, అలా చేసినప్పుడే మన కార్యం నెరవేరుతుంది. నేను ఇప్పుడే మంత్రనిష్ఠకు పూనుకోబోతున్నాను. దాన్ని మహామాయుడి స్వాధీనంలో వున్న దుష్టశక్తులు పాడుచేయకుండా కాపాడవలసిన బాధ్యత నీది. అంటే—ఒకరకంగా నువ్వే నన్ను రక్షించవలసి వుంటుందన్నమాట!" అన్నాడు పద్మపాదుడు.

"నేను మిమ్మల్ని రక్షించటమా?" అని పింగళుడు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"అవును. నువ్వే నన్ను రక్షించవలసి వుంటుంది. నేను మంత్రనిష్ఠలో వుండగా నా చుట్టూ ఏమి జరుగుతుందో నాకు తెలియదు. కనుక, ఆయుధపాణివై నీవే నన్ను సదా కాపాడవలసి వుంది. ఇదుగో ఆయుధం!" అంటూ పద్మపాదుడు గాలిలో చెయి చాచి ధగధగమని మెరుస్తూ

కళ్ళకు మిరుమిట్లు కొల్పుతున్న ఒక గదను అందుకుని, పింగళుడికి ఇచ్చాడు.

పింగళుడు, పద్మపాదుడి నుంచి గదను అందుకుని దానిని గిరగిర తిప్పి చూసి, భుజాన పెట్టుకున్నాడు. పద్మపాదుడు అతడి కేసి ఆప్యాయంగా చూస్తూ, "అయితే పింగళా, ఇక నేను సమాధిలో వుండి మంత్రోచ్చారణ చేస్తాను. మాయారూపాలు ధరించి మనను బాధించ వచ్చే మహామాయుడి పిశాచగణాన్నుంచి నన్నూ, నిన్నూ కూడా రక్షించుకోవలసిన బాధ్యత నీది. త్వరలోనే ఈ నదీజలాన్ని స్తంభింపచేసి, ఇంకిపోయేట్టు చేస్తాను," అన్నాడు.

"అలాగే కానివ్వండి. ఈ గద సహాయంతో ఎటువంటి రక్కసులనైనా సరే పారదోలగలను," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు నది ఒడ్డునే పద్మాసనం వేసి కూర్చుని, నదీజలాన్ని రెండు మూడు సార్లు చేతితో కదిపి, "జల – సర్వస్తంభనం....కురు కురు....శీఘ్రం వశ్యం.... ఠః ఠః..." అంటూ కళ్ళు మూసుకున్నాడు.

పద్మపాదుడు ఆ విధంగా కళ్ళు మూసుకునేంతలో, ఆకాశం గింగుర్లెత్తేలా కీచుమన్న వికృతధ్వని వినిపించింది. పింగళుడు అదిరిపడి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చుకుని, భుజంమీది నుంచి



గదను చేతిలోకి తీసుకుని, ఆకాశం కేసి చూశాడు.

ఒక్క తృటికాలం ఆకాశమంతా నల్లని కారుమేఘంతో కప్పబడినట్టయింది. చూస్తూండగానే అది కుంచించుకుపోతూ, క్రమంగా ఏనుగు ప్రమాణానికి తరిగి పోయింది. "ఓహోం, నన్ను లోగడ ఎదిరించిన మాయాగజం, మళ్ళీ నా మీదకు వస్తున్నదన్నమాట!" అనుకుంటూ పింగళుడు గదను గట్టిగా గుప్పెటలో బిగించాడు. కాని ఆ మేఘం ఏనుగు ఆకృతి ధరించక తృటికాలంలో పెద్ద పక్షిలా అయి, రెక్కలు అల్లల్లాడించ సాగింది.




''ఇది పిశాచ గండ భేరుండ పక్షి, సందేహం లేదు!'' అనుకున్నాడు పింగళుడు.

గండభేరుండ పక్షి దిక్కులు పిక్కటిల్లేలా కేకరించి రెక్కలాడిస్తూ, సూటిగా పింగళుడు నిలబడి వున్న చోటుకు దిగసాగింది. అది క్రమంగా కిందికి వస్తూన్న కొందికీ దాని రెక్కల నుంచి వెలువడే గాలి తాకిడికి ఆ ప్రాంతాల గల చెట్టూ చేమలు తుఫాను దెబ్బకు ఊగిపోయినట్టు ఊగిపోయినై.

పింగళుడు చలించలేదు. ఆ పక్షి తనను కోడిపిల్లను తన్నుకు పోయినట్టు తన్నుకు పోయేందుకు వస్తున్నదని అతనికి తెలుసు. అయినా తన చేతిలో పద్మపాదుడు యిచ్చిన **మంత్రశక్తి** గల గద ఉన్నది!

పింగళుడు గదను రెండు గుప్పెట్ల లోనూ బిగించి పట్టుకుని పైకెత్తాడు. పిశాచ పక్షి అతణ్ణి సమీపిస్తున్నది. బారెడు పొడవున కొసదేరిన ముక్కూ, పదునైన కాలిగోళ్ళూ, నిప్పులు చెరిగే కళ్ళూ-అది చాలా భయంకరంగా, వికృతంగా ఉన్నది. అది దగ్గరకు వస్తున్నప్పుడు దాని రెక్కల గాలి రివ్వు రివ్వుమంటూ శబ్దం చేయసాగింది. దాని తాకిడికి పింగళుడు ఉన్న చోటున కాలు నిలదొక్కుకోలేక, అల్లంత దూరం కొట్టుకుపోయాడు. అదే సమయంలో పిశాచ పక్షి అతడి తలకు దగ్గరగా ముక్కు సాచింది. పింగళుడు చేతనున్న గదను బలంగా విసిరాడు. కాని పక్షి ఆ దెబ్బ తప్పుకుని, వికృతంగా అరిచి పైకి ఎగిరిపోయింది.

''బతికిపోయాను!'' అనుకుంటూ పింగళుడు పైకి చూశాడు. పిశాచపక్షి ఆకాశంలోకి చాలా దూరం ఎగిరిపోయి, ఈసారి మరింత వేగంగా కిందికి దిగిరాసాగింది. పింగళుడు పాదాలు భూమిలోకి బాగా గుచ్చి, గద పైకెత్తి సిద్ధంగా ఉన్నాడు. పక్షి రివ్వు మంటూ తలమీదికి వచ్చేసరికి, అతడు గురిగా గదను దాని తల మీద విసిరికొట్టాడు. మరుక్షణం

కొండ బద్దలయినట్టు ఢాం అన్న శబ్దం వెలువడింది. పిశాచపక్షి తునా తునియలై, తల ఒక వైపుకూ, రెక్కలూ, కాళ్ళూ మరొక వైపుకూ చెల్లా చెదురుగా ఎగిరి, మొండెం భూమిమీద పడింది.

పింగళుడు ఆ దృశ్యం చూసి సంతోషం పట్టలేక, 'జై, పద్మపాదా!' అంటూ గదను గిరగిరా తిప్పుతూ గంతులు వేశాడు. తరవాత మంత్రనిష్ఠలో వున్న పద్మ పాదుణ్ణి చూశాడు. పద్మపాదుడిలో ఏమాత్రం చలనం లేదు. అతడి కళ్ళు మూతలు పడి ఉన్నాయి. పెదాలు మాత్రం అప్పుడప్పుడూ కదులుతున్నాయి. ''ఈయనకు నిష్ఠాభంగం కలగలేదు. అంతేచాలు!'' అనుకుంటూ పింగళుడు వెనుదిరగబోయేంతలో ఘల్లు, ఘల్లు మంటూ గజ్జెలమోత వినబడింది.

పింగళుడు నిశ్చేష్టుడయ్యాడు. ఎదురుగా సర్వాలంకారాలతో అప్సరసలా ఉన్న ఒక యువతి నాట్యం చేస్తూ పాట పాడుతున్నది. ఆమె సౌందర్యం, గంధర్వ గానం విని పింగళుడు ఒక్క తృటికాలం తనను తామరిచాడు.

''పింగళా! నీ అందం చూసి నేను ఇక్కడకు వచ్చాను. నన్ను వివాహం ఆడు. నీకు సర్వసంపదలూ సమకూరుస్తాను.'' అన్నది ఆ యువతి.



ఆ సరికి పింగళుడు తన్నుదా సముదాయించుకుని, ''నువ్వు నా అందం చూసి వచ్చావా? నేను ఏ మహారాజు కుమారుణ్ణో అనుకుంటున్నావేమో! అలా పొరబడకు. నేను జాలరిపింగళుణ్ణి!" అన్నాడు.

''జాలరివయితే మాత్రం ఏం? నీ అంత అందగాడు, పధ్నాలుగు లోకాల్లోనూ వుండడు.'' అంటూ ఆ యువతి నాట్యం ప్రారంభించింది.

పింగళుడు ఆమె కేసి అనుమానంగా చూస్తూ, ''నీ గొంతుతో పాటు శ్రుతి కలిపి చాలా పక్క వాద్యాలు వినబడుతున్నవి! ఆ వాద్యగాళ్ళంతా, నా కంటికి కనబడరేం?'' అన్నాడు.

"నన్ను పెళ్ళాడితే తప్ప, నీకు వాళ్లు కనిపించరు. నేను ఖేచరిని!" అన్నది, యువతి.

"ఖేచరివా? ఓహో-ఆకాశంలో సంచరించే గంధర్వ కాంత వన్నమాట!" అంటూ పింగళుడు గద పైకెత్తి, ఆమెను సమీపించబోయాడు.

"పింగళా! ఆ గద దూరంగా పారవెయ్యి. నాకు ఆయుధాలంటే భయం," అంటూ ఖేచరి వెనక్కు నడిచింది.

దానితో, పింగళుడికి ఆ యువతి ఎవరైనదీ అర్థమైపోయింది. పద్మపాదుడికి నిష్ఠాభంగం కలక్కుండా కాపాడుతున్న తనను, ముందుగా మాయచేసి సంహరించేందుకు వచ్చిన పిశాచమని తెలుసుకున్నాడు. అతడు పొంగి వచ్చే కోపాన్ని అణచుకుని, లేని సంతోషాన్ని కనబరుస్తూ, "ఓ ఖేచర కాంతామణీ! నిన్ను వివాహమాడేందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. కాని, సమయానికక్కడ, మా ముత్తాత తాతగారి, మూడవ భార్య లేనందుకు నేను విచారిస్తున్నాను. ఆవిడే నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసింది. అయినా ఫరవాలేదు. మా వంశాచారం ప్రకారం, పెళ్ళికి ముందు ఈ గదతో నీ నెత్తిమీద ఒక్కసారి మోదనియ్యి," అంటూ ముందుకు వురికాడు.



ఖేచరి కెవ్వున కేకవేసి, వెనక్కు పరిగెత్తబోయింది. ఈ లోపల, పింగళుడు గదతో, ఆమెను బలంగా నెత్తిమీదకొట్టాడు. మరుక్షణం పెద్దధ్వనితో మాయారూపంలో వచ్చిన పిశాచిని ముక్కలు చెక్కలుగా పేలి, గాలిలోకి ఎగిరిపోయింది.

పింగళుడు పెద్దగా నవ్వి, వెనుదిరిగి పద్మపాదుడి దగ్గరకు వచ్చాడు. పద్మపాదుడు యింకా కళ్ళు మూసుకునే వున్నాడు. పింగళుడి దృష్టి నది కేసి వెళ్ళింది. అతడి ఆశ్చర్యానికి అంతు లేదు. నదిలో నీరు చూస్తూండగానే, యింకిపోతున్నది. అప్పటి వరకూ ఆ నీటిలో ఆవాసం ఏర్పరుచుకున్న జల

చరాలు, కుప్ప తిప్పలుగా బయటపడుతూ అటూ యిటూ గెంతుతున్నవి.

''పింగళా!'' అంటూ పద్మపాదుడు కళ్ళు తెరిచాడు. పింగళుడు ఒక్క ఎగురున పద్మపాదుణ్ణి సమీపించి, "పద్మపాదా! నది కేసి చూడు!'' అన్నాడు.

పద్మపాదుడు నది కేసి చూస్తూ, ''భేష్, మహామాయుడి శిష్యులు మాట నిలుపుకున్నారు! ఇంతకూ మనకు కావలసిన పాడుదేవళం ఎక్కడ?'' అన్నాడు.

పింగళుడు నదిమధ్య కేసి పరీక్షగా చూసి, ''అదుగో, యిప్పుడిప్పుడే శిఖరం నీటినుంచి బయటికి వస్తున్నది! అదేనా మహామాయుడి సమాధి అయిన దేవళం?'' అని అడిగాడు.

పద్మపాదుడు, పింగళుడు చూపిన వైపుకు చూస్తూ, తృప్తిగా నవ్వి, ''అదే పాడుబడిన దేవళం. నదిలో ఒక్కచుక్క నీరు లేకుండా యింకిపోయిన తరవాత, మహామాయుడి శిష్యులిద్దరూ మన దగ్గిరకు వస్తారు. సరే, నేను నిష్ఠలో వుండగా, దాన్ని భంగపరిచేందుకు పిశాచ గణమేమీ రాలేదుగదా?'' అని అడిగాడు.

పింగళుడు సంతోషంతో తను సంహరించిన పిశాచ గండభేరుండ పక్షిని గురించీ, ఖేచరకాంతను గురించీ చెప్పాడు. అంతా విన్న పద్మపాదుడు, పింగళుడి భుజం తడుతూ, ''పింగళా, గంధర్వస్త్రీ రూపంలో వచ్చిన పిశాచిని అందానికి వశుడవు కాకుండా నిగ్రహించుకున్నందుకు, నాకు చాలా ఆనందంగా వుంది. నువ్వు, పాడు దేవళంలో ప్రవేశించినప్పుడూ, యిలాంటి పరీక్షలనే కొన్నింటిని ఎదుర్కోవలసి వస్తుంది. జాగ్రత్త,'' అన్నాడు.

అంతలో నదీ మధ్యం నుంచి, ''మహామాంత్రికా!'' అన్న కేక వినబడింది.

పద్మపాదుడూ, పింగళుడూ అటు కేసి చూశారు. ఒక దేవాలయ శిఖరం, వారి దృష్టి నాకర్షించింది. దాని పక్కనే నిలబడి, మహామాయుడి శిష్యులిద్దరూ కనిపించారు. వారు, పద్మపాదుడి కేసి చూస్తున్నారు. —(ఇంకా వుంది)






# ఓటమికి కారణం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భీతికొల్పే యీ శ్మశానంలో, యిన్ని శ్రమలకోర్చి నువ్వు సాధించదలచినదేమిటో, నాకర్థం కావడం లేదు. చాలా మంది సామాన్య శక్తిమంతులు, తాము మహావీరుల మన్న భ్రమలో తలకుమించిన కార్యం సాధించబోయి విఫలులవుతారు. నువ్వూ, అలాంటి వాళ్ళ కోవకు చెందినవాడివేమోనన్న అనుమానం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా నీకు శూరసేనుడు, సువీరుడు అన్న వాళ్ళ కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



భద్రగిరి యువరాజు శూరసేనుడు పదహారు సంవత్సరాల వయసులోనే అన్ని యుద్ధవిద్యల్లోనూ ఆరితేరాడు. అయినా, అతడు నిరంతరం సాధన చేస్తూండేవాడు. ప్రపంచంలో తనను మించిన వీరుడు వుండరాదన్నది అతడి కోరిక.

ఒకనాడు దేశ సంచారం చేస్తున్న అథర్వణస్వామి భద్రగిరికి వచ్చాడు. రాజు ఆయనకు సకల మర్యాదలూ చేశాడు.

శూరసేనుడు ఆయనను వంటరిగా దర్శించి, తన విద్యను ప్రదర్శించి, "స్వామీ, ప్రపంచంలో నా కన్న గొప్ప వీరుణ్ణి ఎక్కడైనా చూశారా?" అని అడిగాడు.

శూరసేనుడు అలా అడగడానికి కారణం వున్నది. అథర్వణస్వామికి తెలియని విద్యంటూ లేదని చెప్పుకునేవారు. అయితే, ఆయన శాంతికాముకుడు. తను శిష్యులను స్వీకరించడు. కానీ, హింస లేకుండా ఎవరైనా యుద్ధ విద్యలు ప్రదర్శిస్తే చూసి ఆనందిస్తాడు. ఒక్కొక్కసారి కొన్ని మెలుకువలు కూడా ఉపదేశిస్తూంటాడు.

శూరసేనుడి ప్రశ్నకు ఆయన నవ్వి, "నిరంతర సాధనతో నువ్వు అభ్యసించిన ఈ విద్య మెచ్చుకోతగినది. అయితే, ఏ గురువు సాయం లేకుండా సహజంగా యీ విద్యలన్నీ అబ్బిన సువీరుడికి, నువ్వు సాటి కాగలవో లేదో నేను చెప్పలేను," అన్నాడు.

శూరసేనుడు అథర్వణస్వామి ద్వారా సువీరుడి గురించిన వివరాలు తెలుసుకున్నాడు. అతడు ఆ రాజ్యంలోనే ఒక గ్రామంలో వుంటున్నాడు.

"సువీరుడు అకారణంగా ఎవరితోనూ యుద్ధానికి దిగడు. అతడిది చాలా శాంత స్వభావం. కేవలం బలాబలాలు నిర్ణయించుకోవడం కోసమైతే, అతడు నీతో యుద్ధానికి అసలు అంగీకరించక

పోవచ్చు,'' అని శూరసేనుణ్ణి హెచ్చరించాడు అధర్వణుడు.

అధర్వణుడు వెళ్ళిపోయాక, తండ్రి అనుమతి తీసుకుని శూరసేనుడు, సువీరుడుండే గ్రామానికి బయలుదేరాడు. అతడు యువరాజులాగా కాక, ఒక సామాన్యుడి వేషంలో ఆ గ్రామం చేరుకున్నాడు.

సువీరుడిది మామూలు పెంకుటిల్లు. అతడిది సామాన్య జీవనం; తల్లీ తండ్రీ లేరు. అతడు రోజూ అడవికివెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చి ఊళ్ళో అమ్ముకుంటాడు. అతణ్ణి చూడగానే మహావీరుడని ఎవ్వరికీ అనిపించదు.

అయితే, సువీరుడి పరాక్రమం గురించి ఆ గ్రామంలో ఎన్నో కథలు చెప్పుకుంటారు. ఒకరోజు అర్ధరాత్రి గ్రామం దోయవచ్చిన పదిమంది బందిపోట్లను, అతడు ఒంటరిగా ఎదుర్కొని బంధించి రక్షకభటులకు అప్పగించాడు. మరొకసారి అరణ్యంలో హఠాత్తుగా మీదికి దూకిన సింహాన్ని ముష్టిఘాతాలలో చంపి భుజాన వేసుకుని, గ్రామానికి తీసుకు వచ్చాడు.

సువీరుడితో బలాబలాలు తేల్చుకునేందుకు శూరసేనుడు ఒకరాత్రివేళ అతడి ఇంట్లో దొంగలా చొరబడ్డాడు. తరవాత



కావాలని అలికిడిచేసి అతడి కళ్ళబడ్డాడు. సువీరుడు అతణ్ణి చూసి ఆశ్చర్యపోతున్నంతలో రెచ్చగొట్టేందుకు పోయి కలబడ్డాడు. అయితే, సువీరుడు క్షణాల మీద శూరసేనుణ్ణి లొంగదీసి చేతులు వెనక్కు విరిచి కట్టాడు. దానితో సువీరుడి బలం సామాన్యమయినది కాదని శూరసేనుడికి అర్థమయింది.

సువీరుడు, శూరసేనుడికి దొంగతనం ఎంత నీచమైనదో చెప్పి, ''కష్టపడి పని చేసుకుని బతుకుతావనే నమ్మకంతో, నిన్ను వదిలిపెడుతున్నాను,'' అన్నాడు.

దానికి శూరసేనుడు, ''నన్ను మించిన బలిశాలి లేడనుకుని, ఆ ధైర్యంతో నీ

యింట దొంగతనానికి వచ్చాను. కాని, నా అంచనా తప్పని ఋజువయింది!'' అన్నాడు.

ఆ మాటలకు సువీరుడు, ''నువ్వు నా కంటే బలశాలివే కావచ్చు. అయితే, నువ్వు దొంగగా నా ఇంటికి వచ్చావు. ఆ తప్పు నీ సగం బలాన్ని హరించింది. అందువల్లనే నిన్ను అంత సులభంగా లొంగదీయగలిగాను,'' అన్నాడు.

సువీరుడు అన్నదాంట్లో నిజం వున్నట్టు శూరసేనుడికి తోచింది. అయితే, అతడితో ద్వంద్వయుద్ధం చేయడం ఎట్లా? అతడు కొంచెంసేపు ఆలోచించి, ''నేనూ కష్టపడి పని చేస్తాను, ఏదైనా పని చెప్పు?'' అన్నాడు.

సువీరుడు అతణ్ణి మర్నాడు తనతో పాటు అరణ్యానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ సువీరుడు చకచకా చెట్లు నరుకుతూ, వాటిని కట్టెల కింద కొడుతూంటే, శూరసేనుడు మాత్రం ఒక చెట్టు నరికేందుకే నానా ప్రయాసాపడి చెమటలు కక్కుతూ నీరసంతో కూలబడిపోయాడు.

తనకేసి ఆశ్చర్యంగా చూస్తున్న సువీరుడితో, శూరసేనుడు, ''బలంలో నీకు, నేను సరిపోలను. నా వల్ల ఏ పనీ కాదు,'' అన్నాడు.

సువీరుడు అతణ్ణి ఓదార్చుతూ, ''ఇది మన బలానికి పరీక్ష కాదు. ఇటువంటి విద్యలు అభ్యాసంతో వస్తాయి. ఆరం



భంలో నేనూ, నీలాగే క్షణాలమీద నీరస పడిపోయేవాడిని. కొన్నాళ్ళు గడిస్తే నువ్వూ, నా మాదిరిగా తయారవుతావు. దిగులుపడకు!'' అన్నాడు.

శూరసేనుడికి అదీ నిజమే అనిపించింది. కొంతసేపు అలాగే ఆలోచిస్తూ వుండి, అతడు సువీరుణ్ణి రెచ్చగొట్టేందుకు, ''నువ్వు యుద్ధవిద్యల్లో ఆరితేరిన వాడివని విన్నాను. ఎప్పుడైనా మహావీరులతో పోరాడావా?'' అని అడిగాడు.

''నేను అవసరం అయితే తప్ప యుద్ధానికి దిగను, అది నా ప్రవృత్తికి విరుద్ధం. అయితే, ఎవడైనా అహంకారి ప్రపంచంలో తనను మించిన వీరుడు లేడని విర్రవీగితే, బుద్ధి చెప్పడానికి, వాడితో యుద్ధం చేస్తాను,'' అన్నాడు సువీరుడు.

''అయితే, నేను అహంకారిని! నాతో యుద్ధం చేస్తావా? లేక నన్ను మించిన వీరుడు లేడని ఒప్పుకుంటావా?'' అన్నాడు శూరసేనుడు.

''నీవంటి సామాన్యుడికి అహంకారముంటే, అది నీకే చెరుపు. కాని, గొప్పవాళ్ళ అహంకారం ప్రపంచానికే చెరుపు చేస్తుంది. అందువల్ల, నీ అహంకారాన్ని లెక్కచెయ్యను,'' అన్నాడు సువీరుడు.

అప్పుడు శూరసేనుడు తానెవరైందీ నిజం చెప్పి, ''నాతో బయల్దేరి రాజధానికి రా! అందరిముందూ మనం విద్యాప్రదర్శన చేసి ద్వంద్వయుద్ధం చేద్దాం.





ఈ ప్రపంచంలో వీరుడిగా నాకు ఎదురు వుండకూడదన్నది నా ఆశయం,'' అన్నాడు.

''నన్ను నీవు నెగ్గగలవనే అనుకుంటున్నావా ?'' అని అడిగాడు సువీరుడు ఆశ్చర్యంగా.

''నాలో ఎంతో బలసంపత్తి వుండీ, అభ్యాసం లేక గొడ్డలితో చెట్లను నరకలేక పోయాను. నీలో బలసంపత్తి వుండవచ్చు. కానీ, యుద్ధవిద్యల విషయమై నీకు అభ్యాసం తక్కువ. చిన్నతనం నుంచీ అదే సాధనలో వున్న నన్ను, నీవు ఓడించలేవని నా నమ్మకం,'' అన్నాడు శూరసేనుడు.

''అయితే, యిప్పుడే నీ అభిప్రాయం తప్పని ఋజువు చేస్తాను. కోయిల పాటకూ, సింహం వేటకూ అభ్యాసం కావాలనుకోవడం నీ అవివేకం!'' అన్నాడు సువీరుడు.

ఇద్దరూ ఆ అరణ్యవృక్షాల కింద మల్ల యుద్ధం చేశారు. సువీరుడు, శూరసేనుణ్ణి క్షణాల మీద చిత్తు చేశాడు. తరవాత యిద్దరూ సువీరుడి ఇల్లు చేరి, అక్కడ కత్తియుద్ధం చేశారు. అందులోనూ సువీరుడిదే పైచేయి అయింది.

అయినా, శూరసేనుడు మొండిగా, ''నువ్వు రాజధానికి వచ్చి నన్ను ఓడిస్తే తప్ప, లేకపోతే నేను యీ ప్రపంచంలో అందరికన్న మహావీరుడినే అనుకుంటాను,'' అన్నాడు.

సువీరుడు, శూరసేనుడితో కలిసి రాజధానికి వచ్చాడు. అక్కడ అతడు పేరెన్నికగన్న మహావీరులందరినీ, అన్ని యుద్ధవిద్యలలోనూ ఓడించాడు. అయితే, విజయం కోసం అతడు చాలా శ్రమపడవలసి వచ్చింది.

చిట్టచివరకు సువీరుడికీ, శూరసేనుడికీ ద్వంద్వయుద్ధం ఏర్పాటయింది. మల్లవిద్య, ఖడ్గవిద్య, అస్త్రవిద్య, గుర్రపు స్వారీలాంటి ఎన్నో విద్యల్లో వారిరువురూ పోటీపడ్డారు. చిత్రమేమంటే—ఇక్కడ

అన్నిట్లోనూ శూరసేనుడిదే పైచేయి అయింది!

సువీరుడు తన ఓటమిని అంగీకరించి వెళ్ళిపోబోతూంటే, శూరసేనుడు అతణ్ణి మనసారా కౌగలించుకుని, "మిత్రమా, నిన్ను గెలిచినప్పటికీ, ప్రపంచంలో నన్ను మించిన వీరుడు లేడన్న అహంకారం నా కిప్పుడు ఏమాత్రం లేదు. ఇక్కడ నిన్ను, నేనెలా గెలిచానో నాకు బాగా తెలుసు!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అంతకుముందు అన్ని యుద్ధవిద్యల్లోనూ శూరసేనుణ్ణి చిత్తుగా ఓడించిన సువీరుడు రాజధానిలో అతడి మీద ఎందుకు ఓడిపోయాడు? విజయం సాధించేందుకు శూరసేనుడు ఏదైనా మోసం చేశాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇందులో శూరసేనుడు చేసిన మోసం ఏమీలేదు. కాని, అతడు సువీరుడి అంత గొప్ప శక్తి సామర్థ్యాలకు గల మూలకారణం ఏమిటో గ్రహించాకనే, విజయం సాధించగలిగాడు. అన్ని విద్యలూ సువీరుడికి సహజంగా అబ్బినవై కాబట్టి, అవి సహజ వాతావరణంలోనే రాణిస్తాయి. అందుకే సహజ విద్యలకు స్థానబలం అవసరం! అలాంటి స్థానబలం లేనప్పుడు, సహజబలం కల వారి ధైర్యం కొంత నశిస్తుంది. నీటిలో ఏనుగును సైతం ఎదిరించే మొసలి, నీటి బయట కుక్కలకు సైతం దూరంగా వుండాలనుకుంటుంది. కొదమ సింహం ఏ కారణంవల్లనైనా నగరానికి వస్తే, ఆత్మ రక్షణ చూసుకుంటుంది తప్ప, వేటకు ప్రయత్నించదు. రాజధానిలో సువీరుడికి స్థానబలం లేదు. అతడి మనసు శూరసేనుడి స్థానబలానికి లొంగిపోయింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# జూదరిలాభం

ఆనందయ్య పేరుమోసిన జూదరి. అతడు అలవాటు ప్రకారం ఒక అర్ధరాత్రివేళ ఇల్లు చేరి, తలుపు తట్టాడు. భార్య రుసరుసలాడుతూ పోయి, తలుపు తెరిచింది. ఆనందయ్య చిరునవ్వుతో లోపలికి వచ్చాడు. జూదగృహంలో రోజూ, అంతో యింతో డబ్బు పోగొట్టుకు వచ్చే భర్త, అలా సంతోషంగా వుండడం చూసి, అతడేదో గెలుచుకువచ్చాడనుకున్నది, భార్య.

"ఇవ్వాళ ఏదో నాలుగు డబ్బులు గెలిచినట్టుందే!" అన్నదావిడ.

"నాలుగు వేల రూపాయిలంటే, ఏదో నాలుగు డబ్బులుగా నీకు కనబడుతున్నవా?" అన్నాడు ఆనందయ్య.

భార్య సంతోషంగా డబ్బు చూపెట్టమన్నది.

ఆనందయ్య ఉత్సాహంగా, "ఆ డబ్బు నా దగ్గిర లేదనుకో! కాని, ఆ మొత్తం నేను గెలవలేదని ఎవరూ అనలేరు. సంగతేమంటే, జూదంలో ఇద్దరికి ఐదు వేలు బాకీ పడ్డాను. ఇచ్చేందుకు, నా దగ్గిర డబ్బులేదు. ఐదు వేలకు బదులు గెలిచినవాళ్ళు, నా రవ్వలఉంగరం తీసుకున్నారు. ఆ ఉంగరం ఎంతకొన్నానో, నీకు తెలిసుండి కాదుగదా—వెయ్యి రూపాయిలు. అంటే, నేను దాని మీద నాలుగు వేలు సంపాయించినట్టు!" అన్నాడు.

—రవివరపు రామదాసు






# అధికార దుర్వినియోగం

సమరపురికి దక్షిణాన దట్టమైన అరణ్యం వుండేది. ఆ అరణ్య ప్రాంతాన నివసించే ప్రజలు, అందులోని జంతువులనూ, పక్షులనూ వేటాడటమే గాక, చెట్లను నరికి కలపగానూ, వంటచెరుకుగానూ వాడుకోసాగారు.

పరిస్థితి యిలా మరి కొంతకాలం సాగితే, అరణ్యం సర్వనాశనమై పోతుందని గ్రహించిన రాజు చంద్రవర్మ, ఎవరూ అక్రమంగా చెట్లను నరకకుండా కాపాడేందుకు ఒక ప్రత్యేక అధికారిని నియమించాడు.

ఒకరోజు ఆ అధికారి అరణ్యంలో తిరుగుతూండగా, ఒకచోట యువకుడొకడు కట్టెలు కొడుతూ పట్టుబడ్డాడు.

అధికారి వాడిపై కళ్ళెర్రచేసి, "ఇప్పుడు నిన్ను రాజుగారికి వప్పచెబితే, ఆయన నీకు వంద వరహాలు జరిమానా విధిస్తాడు. అరణ్యంలో కట్టెల కోసం చెట్లునరకడం, నేరమని తెలియదా ?'' అన్నాడు.

యువకుడు వణికిపోతూ, ''అయ్యా, క్షమించండి! కొంతమంది, యీ ప్రాంతాల కట్టెలు కొడుతూ కనిపిస్తే, నేనూ బతుకు తెరువుకు యీ పనిచేశాను. కట్టెలు కొట్టకూడదన్న సంగతి, నాకు తెలియదు. దయవుంచి నన్ను వదిలేయండి,'' అన్నాడు.

ఈసారి అధికారి నవ్వుతూ, ''నువ్వు కూడా, నీకు కనిపించిన వాళ్ళలాగే కట్టెలు కొట్టుకోవచ్చు. కాని, అందుకు నువ్వు రోజూ ఐదు వరహాలు యివ్వాలి. వాళ్లంతా అలాగే యిస్తున్నారు,'' అన్నాడు.

తాను కొట్టిన కట్టెలు నగరంలో అమ్మితే యువకుడికి రోజూ పది వరహాలు గిట్టుతున్నాయి. అందులో ఐదు వరహాలు అధికారికి యిచ్చినందువల్ల,

రాంబాబు




పెద్ద నష్టం ఏమీ లేదనుకుని యువకుడు అధికారికి ఐదు వరహాలు యిచ్చాడు.

ఇలా ప్రతిరోజూ యువకుడు ఐదు వరహాలు యిస్తూ, నెల రోజులు కట్టెలు కొట్టుకున్నాక, అధికారి వాణ్ణి రోజుకు పది వరహాలు యిస్తే తప్ప కట్టెలు కొట్టుకునేందుకు వీల్లేదన్నాడు.

అధికారికి పది వరహాలు యిస్తే, తనకు మిగిలేది ఏమీలేదు. ఈ కారణం వల్ల యువకుడు అతడికి డబ్బివ్వ నిరాకరించి, మొండిగా కట్టెలు కొట్టసాగాడు.

దానితో అధికారి మండిపడుతూ, "నువ్వు రాజుగారి ఆజ్ఞను ఉల్లంఘించి అరణ్యంలో కట్టెలు కొడుతున్నావు. నువ్వు వెంటనే, నాతోపాటు రాజుగారి దగ్గరకు రాకపోతే, భటులను పిలిచి, నిన్ను బంధించి తీసుకుపోతాను," అన్నాడు.

యువకుడు ఏ మాత్రం జంకక, "అలాగే, నీ వెంట రాజుగారి దగ్గరకు వస్తాను. కాని, ఒక సంగతి గుర్తుంచుకో! రాజుగారికి జరిగిందేమిటో చెబితే, నీకే ముప్పు," అన్నాడు.

అధికారి యువకుడి హెచ్చరిక పట్టించుకోలేదు. ఒకవేళ యువకుడు తాను లంచం తీసుకున్నట్టు రాజుగారికి చెబితే, సాక్ష్యాధారం లేని ఫిర్యాదును ఆయన నమ్మడని అధికారికి తెలుసు. ఆ ధైర్యంతో అధికారి యువకుణ్ణి రాజుగారి దగ్గరకు తీసుకు పోయాడు.

రాజు చంద్రవర్మ యువకుణ్ణి చూసి, "నువ్వు అడవిలో, నా ఆజ్ఞను ఉల్లంఘించి కట్టెలు కొడుతున్నావు. ఇది నేరం. నువ్వేం చెప్పకోదలిచావు?" అని అడిగాడు.

యువకుడు, అధికారికేసి తలతిప్పి, "అయ్యా, నేను అరణ్యంలో కట్టెలు కొడుతూండగా, ఎంత కాలం నుంచి చూస్తున్నారు?" అని అడిగాడు.

వెంటనే అధికారి రాజుతో, "మహారాజా, వీడు చాలా పొగరుబోతు. గత

నెల రోజులనుంచీ వీడు అక్రమంగా అరణ్యంలో ప్రవేశించి కట్టెలు కొడుతున్నాడు,'' అన్నాడు.

ఆ మరుక్షణం యువకుడు, '' ఈయన చెప్పింది నిజం! నేను నెలరోజులనుంచీ అరణ్యంలో కట్టెలుకొట్టి అమ్ముకుంటున్నాను. కాని, ఆ విషయం యీయన నెలరోజుల నుంచీ చెప్పకుండా వూరుకుని, యివ్వాళ చెప్పడంలో వున్న రహస్యం ఏమిటో తమరు ఆలోచించాలి,'' అన్నాడు రాజుతో.

రాజుకు యువకుడి మాటలలోని అంతర్యం అర్థమైంది. ఆయన కోపంగా అధికారి కేసి చూస్తూ, '' ఇతను నెల రోజులుగా అరణ్యంలో కట్టెలు కొడుతూంటే, ఆ సంగతి నాకు ఫిర్యాదు చేయలేదు. అంటే, యింతకాలంగా నువు అతని దగ్గిర లంచం తీసుకుంటున్నావన్న మాట! మరిప్పుడు నీకు ఫిర్యాదు చేయవలసిన అవసరం ఏమి కలిగింది?'' అని అడిగాడు.

తన నేరం బయట పడడంతో అధికారి వణికిపోతూ తల వంచుకున్నాడు. యువకుడు రాజుకు జరిగినదంతా చెప్పి, '' మహారాజా, ఈయనకు పది వరహాలు లంచం నేనివ్వలేకపోయాను గాని, అలా యివ్వగలవాళ్ళు చాలా మంది రోజూ కట్టెలు కొట్టుకుపోతూనే వున్నారు,'' అన్నాడు.

రాజు అప్పటికప్పుడే అధికారిని పనిలోంచి తీసివేసి యువకుడితో, '' ఈ అధికార పదవి నీ కిస్తున్నాను. నువ్వు లంచాలు తీసుకోవని నమ్మకం ఏమిటి?'' అన్నాడు.

యువకుడు తలవంచి రాజుకు నమస్కరిస్తూ, '' అలా లంచాలు తీసుకున్న వాడి దుస్థితి వినడం కాక, కళ్ళారా చూశాక, ఆ పాడుపని నేనెలా చేయగలను, మహారాజా!'' అన్నాడు.

రాజు ఆ జవాబుకు తృప్తిపడి, యువకుణ్ణి కొత్త అధికారిగా నియమించాడు.



# జ్ఞానబోధ

యోగానందుడు అనే గురువు దగ్గర చాలామంది శిష్యులుండే వారు. వాళ్ళల్లో సాంబు డనే వాడు కోపిష్టే కాక, పెద్దమూర్ఖుడు. తాను చెప్పిందే సత్యమనీ, తాను గొప్ప విజ్ఞానిననీ, యితరు లంతా మూఢులనీ భావించేవాడు. వాడు మిగతా శిష్యులతో ప్రతి విషయంలోనూ గొడవలు పడుతూ, వాళ్ళను తిట్టడం, కొట్టడం చేస్తూండేవాడు. అంతేకాక, యీ సంగతి గురువుగారికి చెబితే ప్రాణాలేదక్కవని బెదిరిస్తూండే వాడు.

సాంబుడి దౌర్జన్యానికి భయపడి తోటి శిష్యులంతా, వాడికి దూరంగా వుండసాగారు. ఇది ఎలాగో యోగానందుడి దృష్టిలో పడింది.

ఆయన ఒకరోజు శిష్యులకు జ్ఞానబోధచేస్తూ, "ఉత్తముడూ, విజ్ఞానీ అయినవాడెప్పుడూ పాదరక్షలు కరిచాయని, తిరిగి వాటిని కరవడు; వాటిని విసర్జిస్తాడు. అలాగే కుక్క మొరిగిందని, దానితో పోటీగా మొరగడు; దానికి దూరంగా వుంటాడు—మీరంతా సాంబుడికి దూరంగా వుంటున్నట్టు!" అని చమత్కరించాడు.

ఈ మాటలతో సాంబుడికి, తానింతకాలంగా ఎలాంటి చెడుమార్గాన నడిచిందీ అర్థ మయింది. ఆ తరవాత వాడు సహధ్యాయులతో స్నేహంగా మెలగసాగాడు.

— మెడికో కృష్ణసుబ్బారావు





# మేక నవ్వింది!

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్త్వుడు ఒక కొండ మీద గొప్ప దేవదారువృక్షంగా పుట్టి, ఆ పరిసరాల్లో నివసించే మనుషుల ప్రవర్తనను గమనిస్తూండేవాడు. ఆ కొండ దిగువున పండితు డొకాయన గురుకులం స్థాపించి, శిష్యులకు విద్యాబోధ చేసేవాడు.

ఒకసారి ఆ పండితుడు కూడనిపని ఏదో చేసి, ఆ పాపపరిహారానికి ఒక వ్రతం చేయ సంకల్పించాడు. ఆ వ్రతం ఫలించాలంటే, విధిగా ఒక మేకను బలి యివ్వవలసి వుంటుంది.

ఆయన ఒక ధనవంతుణ్ణి మేక కోసం యాచించాడు. అతడు తన మందలో వున్న మేకల్లో నుంచి వయసులో బలంగా వున్న దాన్ని పండితుడికి దానం చేశాడు. పండితుడు తన శిష్యుల్లో యిద్దరిని పిలిచి, దాన్ని నదిలో స్నానం చేయించి, మెడలో ఒక పూలదండ వేసి, తిరిగి తన వద్దకు తీసుకురమ్మన్నాడు.

శిష్యులు గురువు ఆజ్ఞ ప్రకారం మేకను నది దగ్గరకు తీసుకుపోయారు. ఆ సమయంలో ఆకాశమంతా మేఘాలతో కప్పబడి వున్నది. వారిలో, ఒకడు దాన్ని నదిలో దింపి శరీరమంతా కడిగాడు. ఆ పని పూర్తయేలోపల రెండవవాడు తీరంలో వున్న చెట్ల నుంచి రకరకాల పువ్వులు కోసి దండ తయారు చేశాడు.

శిష్యులిద్దరూ పూలదండను మేక మెడలో వేసేందుకు బయలుదేరుతున్నంతలో, అది బిగ్గరగా నవ్వింది. మొదట్లో వాళ్ళు, ఆ నవ్వింది మేక కాదనుకున్నారు. కాని, చుట్టుపక్కల మరొక మానవప్రాణి లేకపోవడంతో నవ్వినది మేక అని గ్రహించి, భయకంపితులైపోయారు.



వాళ్ళు ఒకరిముఖాలొకరు చూసుకుని, జంటగా పారిపోయేందుకు కూడబలుక్కుంటున్నంతలో, మేక నవ్వడం మాని, కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. ఇది చూసి ధైర్యం తెచ్చుకున్న శిష్యులు దాన్ని తమ గురువు వద్దకు తీసుకు పోయారు.

వాళ్ళు గురువుతో రహస్యంగా, "ఈ మేక నేదో భూతం ఆవహించినట్టున్నది. నది దగ్గిర యిది మనిషిలా నవ్వింది; ఏడ్చింది. ఇలాంటిది బలిపశువుగా పనికి వస్తుందా?" అన్నారు.

గురువు ఏదో అనబోయేంతలో మేక, "నన్ను బలిపశువుగా ఉపయోగించుకోండి. ఎందుకు సంశయిస్తారు!" అన్నది.

ఆ మాటలు వింటూనే శిష్యులతోపాటు గురువు కూడా భయం కొద్దీ మూర్ఛపడుతున్నంతలో మేక, "అలా భయపడకండి. మీకెలాంటి ప్రాణహానీ కలిగించను," అన్నది.

పండితుడు భయం నుంచి కాస్త తేరుకుని, "మేక మనిషిలా మాట్లాడడం ఎంతటి మహాశ్చర్యం!" అన్నాడు.

"ఇందులో ఆశ్చర్యపడవలసింది రవంత కూడా లేదు. నేనూ ఒకప్పుడు నీలాంటి మనిషినే కాక బ్రాహ్మణ్ణీ, పండితుణ్ణీ కూడా!" అన్నది మేక.

"అలాగా! అయితే, యింత నీచజన్మ నీకెందుకు కలిగింది?" అని అడిగాడు పండితుడు.

ఆ ప్రశ్నకు మేక దీనంగా ముఖం పెట్టి, "నేను చాలా పాపకర్మలు చేశాను. అయితే ఒకానొక వ్రతంచేసి వాటినుంచి బయటపడవచ్చునన్న భ్రమతో, నేనూ ఒక మేకను బలి యిచ్చాను. అయినా, విధిని మోసగించలేకపోయాను. ఆ తర్వాత ఐదువందలసార్లు మేకగా జన్మ ఎత్తడం జరిగింది!" అన్నది.

పండితుడు అమితాశ్చర్యంతో, "ఐదువందలసార్లు మేక జన్మా!" అన్నాడు.

"అవును. ఇందులో నాలుగువందల తొంభైతొమ్మిదిమార్లు ఎవరో ఒకరు నన్ను

బలిపశువుగా వాడుకున్నారు. ఇవాళ నా తల ఐదు వందలసారి తెగబోతున్నది. దీనితో నాకు పాపవిముక్తి కలుగుతుంది. నదిలో స్నానం చేశాక, హఠాత్తుగా నాకు పూర్వజన్మజ్ఞానం కలిగింది. అందుకే నవ్వాను,'' అన్నది మేక.

''అది బాగానే వుంది, మరి ఎందుకు ఏడ్చావు?'' అని పండితుడు అడిగాడు.

''నిజం చెబుతున్నాను. ఐదు వందల జన్మల ముందు, నేనేం చేసి పాపం కట్టుకున్నానో, అలాంటి పనే నువ్వు చేయబోతున్నావని గ్రహించాను. కనుక, నువ్వు నాలాగే మేక జన్మలు ఎత్తి, బాధల పాలవుతావు. నీ బుద్ధిహీనతకూ, ముందు, ముందు నువ్వు అనుభవించే కష్టాలూ తలుచుకుని, నాకు కన్నీరొచ్చింది కాదు,'' అన్నది మేక.



పండితుడు ఆలోచనలో పడ్డాడు. ఆయన శిష్యులు కొంచెం దూరంగా నిలబడి, మేక చెప్పినదంతా విని ఆశ్చర్యం చెందారు. మేకను బలి యివ్వడం ద్వారా, రాబోయే జన్మల్లో గురువుగారికి పట్టనున్న దుర్గతి తలుచుకుంటే, వాళ్లకు కళ్ళ వెంట నీరు కారసాగింది.

పండితుడు తన శిష్యుల కేసీ, మేక కేసీ ఒకసారి సాలోచనగా చూశాడు. ఏవో మంత్రాలు చదివి, ఒక మేకను బలియిచ్చినంత మాత్రాన, తాను చేసిన పాపాలు తుడిచిపెట్టుకు పోతవనుకోవడం అజ్ఞానం అన్న అభిప్రాయం ఆయనకు కలిగింది. అంతేకాక, యిప్పుడు తానొక అల్పజీవిని చంపడం ద్వారా, మరింత పాపాన్ని మూటకట్టుకోవడం జరుగుతుందని గ్రహించాడు.

ఆయన మేకతో, ''భయపడకు! నేను, నిన్ను బలియివ్వను,'' అన్నాడు.

''నాకు చావంటే భయంలేదు. ఎంత త్వరగా చావు వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాను,'' అన్నది మేక.

''అదంతా నీ యిష్టం. నేను మాత్రం చంపను! నువ్వెంత బ్రతిమాలినా, నా

నిర్ణయం మాత్రం మార్చుకోను" అన్నాడు పండితుడు పట్టుదలగా.

"నాకు యివ్వాళ మృత్యువు రాసిపెట్టి వున్నది. అది నీ చేతి మీదుగా జరక్కపోతే, మరొకరు చేస్తారు!" అన్నది మేక.

పండితుడు ఒక్క క్షణం ఆలోచించి, "అలా జరగకూడదు. నీ కెవ్వరినుంచీ హాని కలగకుండా చూసే బాధ్యత నాది." అన్నాడు.

ఆయన తన శిష్యులకు మేకను వదిలిపెట్టవలసిందిగా చెప్పాడు. మేక అక్కడినుంచి బయలుదేరి, దాపులనున్న ఒక పండ్లతోటలో ప్రవేశించి కొంతసేపు అటూ ఇటూ తిరిగింది. తరవాత నదీతీరానికి బయలుదేరింది. పండితుడూ, ఆయన శిష్యులూ దానికి కొంచెం దూరంగా నడవసాగారు.

రెండు, మూడు గంటలకాలం మేక ఆ విధంగా తనకిష్టమైన ప్రదేశాలన్నీ తిరిగి కొండకేసి బయలుదేరింది. అది కొండపైకి ఎక్కుతుండగా పండితుడూ, ఆయన శిష్యులూ దిగువున వుండి దాన్ని గమనించసాగారు.

ఆ సరికి కొండపైన ఆకాశంలో మేఘాలు మరింతగా గుమిగూడాయి. మేక ఒక్కొక్క కొండరాయినే ఎక్కుతూ, దిగుతూ శిఖరప్రాంతాన్ని చేరింది. పండితుడూ, ఆయన శిష్యులూ చూస్తుండగా ఆకాశం పెద్దగా ఒకసారి ఉరిమింది. ఆ వెంటనే కళ్ళను మిరుమిట్లు కొల్పుతూ పిడుగొకటి వచ్చి మేకమీద పడింది.

పండితుడూ, ఆయన శిష్యులూ ఈ జరిగింది చూసి, ఒకసారి నిట్టూర్చి, వెనుదిరిగి గురుకులానికి బయలుదేరారు.

కొండ మీద దేవదారువృక్షంగా వున్న బుద్ధుడు వాళ్ళను చూసి చాలా సంతృప్తి చెందాడు. తాము చేసిన పాపకృత్యాల నుంచి విముక్తి పొందేందుకు వ్రతాలూ, యజ్ఞాల్లాంటివి చేసి బలులు యివ్వడం వృథా అన్న జ్ఞానం మనుషుల్లో ఏ కొద్ది మందికైనా కలగడం, ఆయనకు సంతోష కారణం అయింది.






## జహాంగీర్–షాజహాన్

అక్బర్ అనంతరం అతని కొడుకు సలీమ్, జహాంగీర్ నామంతో 1605 వ సంవత్సరంలో మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆదర్శవంతమైన తన తండ్రిలా కాకుండా, జహాంగీర్ నిర్మాణాత్మకమైన కార్యకలాపాలకన్నా, వినోదాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వసాగాడు.

జహాంగీర్ అందాలరాణిగా పేరుగాంచిన మెహరున్నిసా అనే యువ వితంతువును వివాహమాడి. ఆమెకు నూర్జహాన్ అని పేరు పెట్టుకున్నాడు. క్రమక్రమంగా నూర్జహాన్ రాజ్యపరిపాలనా వ్యవహారాలలో జోక్యం చేసుకోసాగింది. నాణేలపై జహాంగీర్ తన చిత్రంతో పాటు, నూర్జహాన్ చిత్రాన్ని కూడా ముద్రించసాగాడు.





జహాంగీర్ పెద్ద కొడుకు ఖుస్రూ, తండ్రి మీద తిరుగుబాటు చేసి, సింహాసనాన్ని ఆక్రమించాలని ఆశించాడు. జహాంగీర్ గొప్ప సైన్యాధిపతి కాకపోయినప్పటికీ, ఈ విషయం తెలియగానే కొడుకును పంజాబు వరకు తరిమి కొట్టి, అతణ్ణి అక్కడే బంధించాడు. ఖుస్రూ జైల్లోనే మరణించాడు.



ఏది ఏమైనా జహాంగీర్ న్యాయబుద్ధి కలవాడు. అందుకోసం దీక్షతో కృషి చేశాడు. ఆగ్రాలోని తన భవనద్వారం నుంచి, యమునానది తీరం వరకు, అరవై గంటలు వేలాడే ఒక గొలుసును కట్టి, న్యాయం కోసం రాజును చూడాలనుకున్న వారు ఏ సమయంలో నైనా సరే ఈ గొలుసును పట్టి లాగవచ్చునే ఏర్పాటు చేశాడు.

ఇంగ్లాండు రాజు మొదటి జేమ్స్ దగ్గరి నుంచి, కేప్టన్ హాకిన్స్, సర్ థామస్ రో అనే ఇద్దరు రాయబారులు వచ్చి జహాంగీర్‌ను దర్శించారు. భారత దేశంలో వ్యాపారం చేసే విషయంగా సంప్రదించారు. సర్ థామస్ రో జహాంగీర్ నుంచి, రాయితీలు సంపాయించి, భారతదేశంలో ఆంగ్లేయులు ప్రవేశించడానికి మార్గంచూపాడు.





జహాంగీర్ పరిపాలనా కాలంలో జరిగిన మరో ముఖ్య సంఘటన మేవార్ పరగణా మొగల్ సామ్రాజ్యంలో కలిసిపోవడం. రాణాప్రతాప్ ఆఖరి క్షణం వరకూ మొగలులను ఎదిరించి పోరాడినప్పటికీ, అతని కొడుకు రాణా అమర్‌సింగ్ అంతటి ధైర్యం చూపలేకపోయాడు. జహాంగీర్ అధికారానికి తలవంచాడు.

జహాంగీర్ మరణానంతరం ఆయన కొడుకు, యువరాజు ఖుర్రం – తన్ను ఎదిరించిన తమ్ముడు షారియార్‌ను, మరికొందరు యువరాజులను చంపి, షాజహాన్ పేరుతో మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించాడు.





షాజహాన్ విలాసప్రియుడు. అమితమైన ధనవ్యయంతో తనకోసం మయూర సింహాసనాన్ని చేయించాడు. మొగల్ రాజ్యంలో అంతర్భాగమైన కాందహార్‌ను, పర్షియా షా వశపరచుకున్నప్పుడు, దానికోసం పోరాడాడు గాని, తిరిగి పట్టుకోలేక పోయాడు.

షాజహాన్ ఢిల్లీలో ప్రసిద్ధమైన ఎర్రకోట మొదలైన బ్రహ్మాండమైన భవనాలను నిర్మించాడు. ఎర్రకోట లోపలి దివాన్–ఇ–ఖాస్ అనే భవనం గోడమీద "భువిపై స్వర్గం అనేది వున్నట్టయితే అది ఇక్కడే! అది ఇక్కడే! అది ఇక్కడే!" అని చెక్కించాడు.





పట్టపురాణి ముంతాజ్ పట్ల షాజహాన్‌కు చెప్పలేనంత ప్రేమాభిమానాలు వుండేవి. దారా, సుజా, ఔరంగజేబు, మూరాద్–అనే నలుగురు కొడుకులను కన్న ముంతాజ్ షాజహాన్ జీవితంలో సుఖసంతోషాలు కలుగజేసింది.

కాని ముంతాజ్ అకాలమరణం పాలవడంతో, షాజహాన్ దిగ్భ్రాంతి చెందాడు. భార్య సమాధి మీద అద్భుతమైన తాజ్ మహల్‌ను నిర్మించాడు. పూర్తిగా చలువరాళ్ళతో నిర్మింపబడిన తాజ్ మహల్ – ప్రపంచంలోని అత్యద్భుతమైన శిల్పకళాఖండంగా వెలుగొందుతున్నది.





షాజహాన్ ఆఖరి రోజులు విషాదంగా గడిచాయి. ఔరంగజేబు తన అన్నదమ్ములను చంపి, తండ్రి షాజహాన్‌ను కోటలో ఖైదుచేశాడు. కూతురు జహనారా రక్షణలో, యమునానదికి అవలి గట్టున వున్న, తాజ్ మహల్ కేసి విచారంగా చూస్తూ, 1666 వ సంవత్సరంలో షాజహాన్ ఖైదులోనే కన్నుమూశాడు.



# పక్షి జోస్యం

కైరో నగరంలో ముస్తఫా అనే ధనిక వర్తకుడుండేవాడు. ఆయన నగరంలోని వర్తకులందరికన్న ఆస్తిపరుడని అందరూ చెప్పుకునేవారు. ఆయనకొక్కతే కుమార్తె. ఆమె అత్యంత సౌందర్యవతి. తండ్రి ఆస్తికంతకూ ఆమె ఒక్కతే వారసురాలు గనక, ఏ సుల్తాను కుమారుడో ఆమెను వివాహమాడగలడని అందరూ అనుకునేవాళ్ళు. ఆమె తల్లిదండ్రులకూ, ఆమెకూ కూడా ఏదో ఒకనాడు తప్పకుండా అలా జరిగి తీరుతుందని గట్టి నమ్మకం వుండేది.

వాళ్ళ దగ్గిర కమల్ అని ఒక బానిస కుర్రవాడుండేవాడు. వాణ్ణి వర్తకుడు సంవత్సరం కిందట సంతలో కొని యింటికి తీసుకువచ్చాడు. వాడు అందగాడు, తెలివైనవాడేగాక చాలా యుక్తిపరుడు. వాడు తన యజమాని కుమార్తెను వివాహమాడేందుకు అన్నివిధాలా అర్హుణ్ణని భావించేవాడు.

అయితే, యీ సంగతివాడు ఎవరితోనూ అనలేదు. వాడు ఆ ఇంట చేరిన సంవత్సర కాలంలో సంపాయించిన ఆస్తి ఒక బంగారు ఉంగరం, ద్రాక్షసారా వున్న చిన్న సీసా. ఈ రెంటినీ వాడు పొరుగున వున్న మరొక చిన్న వర్తకుడి ఇంటినుంచి తస్కరించాడు. వాటిని బహూకరించి తన యజమాని కుమార్తెను వివాహమాడగలననుకునేంత అమాయకుడు కాడు, కమల్. అందుకోసంవాడొక పథకంవేశాడు.

అది మండు వేసవికాలం. అప్పుడే సూర్యాస్తమయం అయి క్రమంగా చల్లని గాలి ప్రారంభమయింది. వర్తకుడూ, ఆయన భార్యా, కుమార్తే తోటలో షికారు బయలుదేరారు. కమల్ వారికి కొంచెం వెనగ్గా నడవసాగాడు. యజమానికి ఏ



క్షణంలో ఏ పనిపడినా చేసేందుకు బానిస కుర్రవాడు అలా వెంట వస్తూండాలి!

వర్తకుడూ, ఆయన భార్యా తమ గృహ విషయాల గురించీ, బంధుమిత్రులను గురించీ మాట్లాడుకోసాగారు. వర్తకుడి కుమార్తె చెట్లకొమ్మల్లో తిరిగే ఉడతలనూ, పక్షులనూ చూసి ఉత్సాహంగా చప్పట్లు చరుస్తూ నవ్వుకోసాగింది. కమల్ మాత్రం అక్కడ తిరిగే పక్షులకేసి పరీక్షగా చూస్తూ, తనలో తాను గొణుక్కోవడం ప్రారంభించాడు.

వర్తకుడు యిది గమనించాడు గాని, కమల్‌ను ఏమీ ప్రశ్నించలేదు. కాని, వాడు ఎంతకూ గొణుగుడు మానకపోయే సరికి, ఆయనకు ఆశ్చర్యం కలిగి కమల్‌ను ఎందుకలా చేస్తున్నావని అడిగాడు.

కమల్ జవాబివ్వకుండా తల వంచుకున్నాడు.

"పక్షులు ఏం మాట్లాడుకుంటున్నదీ నీకు తెలిసినట్టు ప్రవర్తిస్తున్నావు!" అన్నాడు వర్తకుడు నవ్వుతూ.

అది విని వర్తకుడి భార్యా, కుమార్తే కూడా నవ్వారు. కాని, కమల్ తన రహస్యమేదో బయటపడిపోయినట్టుగా వాళ్ళకేసి ఆశ్చర్యపడుతున్నట్టు చూశాడు.

దానితో వర్తకుడికి కుతూహలం కలిగి, "ఇంతకూ నువ్వు గొణుగుతున్నదేమిటి?" అని అడిగాడు.

"యజమానీ, మీరన్నట్టు నాకు పక్షి భాష తెలుసు!" అన్నాడు కమల్.

ఆ జవాబుకు నవ్వాలో, లేక తన బానిసను గట్టిగా మందలించాలో వర్తకుడికి అర్థంకాలేదు. అంతలో వాళ్ళకు సమీపాన వున్న ఒక చెట్టుకొమ్మ మీది నుంచి ఒక కాకి పెద్దగా అరవడం వినిపించింది.

"ఆ కాకి చెప్పేదేమిటి?" అని వర్తకుడు కమల్‌ను అడిగాడు.

"ద్రాక్షసారా వున్న ఒక చిన్న సీసా, యీ చెట్టు మొదట్లో పాతిపెట్టి వున్నదని,



కాకి చెపుతున్నది,'' అన్నాడు కమల్ చెట్టు బోదెకేసి చేయి చూపుతూ.

''నిజమా ?'' అంటూ వర్తకుడు తోట పనివాళ్ళు వదిలిపోయిన గడ్డపార ఒకటి తీసుకుని చెట్టు మొదట్లో తవ్వసాగాడు. అక్కడ సీసా వుంటుందన్న నమ్మకం ఆయన కేమాత్రం లేదు. తన బానిస బడాయిలు పలకకుండా గట్టిగా బుద్ధి చెప్పాలనుకున్నాడు.

అయితే, నిజంగానే అక్కడ భూమిలో వర్తకుడికి ద్రాక్షసారా సీసా దొరికింది. ఆయన నిశ్చేష్టుడైపోయాడు. అతడి భార్యా, కూతురూ కమల్ కేసి భయాశ్చర్యాలతో చూడసాగారు.

అంతలో ఒక చిన్న పక్షి వాళ్ళ తలల మీదుగా ఎగిరిపోతూ కిలకిలమంటూ అరిచింది. కమల్ దానికేసి చూస్తూ తలాడించాడు.

''ఈ పక్షి కూడా ఏదైనా రహస్యం చెబుతున్నదా ?'' అని కమల్‌ను వర్తకుడి భార్య అడిగింది.

''ఆ కనబడే చెట్టు మీద వున్న పక్షి గూట్లో ఒక ఉంగరం వున్నదట! అదీ, ఆ పక్షి పలికిన పలుకులు,'' అన్నాడు కమల్.

వర్తకుడు ఆ మాటలు వింటూనే అదుర్దాకొద్దీ ఏ నౌకర్నో పిలవడంపోయి, తనే స్వయంగా చెట్టెక్కాడు. అక్కడ నిజంగానే పక్షి గూట్లో ఉంగరం దొరికింది!

వర్తకుడు చెట్టు దిగి వచ్చి కమల్‌ను కావిలించుకుని, ''ఆహా, నీ అంత తెలివిగలవాడు, యీ భూ ప్రపంచంలో మరొకడుంటాడనుకోను,'' అన్నాడు.

''మీరన్నది నిజం!'' అన్నది వర్తకుడి భార్య.

ఆ సమయంలో దాపులనున్న పొదల్లోంచి పక్షులు కలకలారావం చేసినై. వెంటనే కమల్ కోపంగా, ''ఇక చాలు, నోళ్లు ముయ్యండి!'' అంటూ అరిచాడు.

''అవి అనేదేమిటి?'' అని వర్తకుడు అడిగాడు.

"ఆ సంగతి మాత్రం చెప్పమని అడక్కండి!" అన్నాడు కమల్ సిగ్గుపడి పోతున్నట్టు ముఖంపెట్టి.

"అదేం కుదరదు. నువు చెప్పి తీరాలి," అన్నాడు వర్తకుడు పట్టుదలగా.

వర్తకుడి భార్య కూడా కల్పించుకుని, "నువ్వు చాలా మంచి కుర్రాడివి, ఆ సంగతేదో దాచకు," అన్నది.

"అది చెప్పడం కన్న చావడం మేలు. చెబితే, ఎలానూ మీ చేతుల్లో నాకు చావు తప్పదు," అన్నాడు కమల్ వణికిపోతూ.

"నీకెలాంటి ప్రాణహానీ కలగదు; నేను మాట యిస్తున్నాను," అన్నాడు వర్తకుడు.

"అందుకు నేను హామీ, సరా!" అన్నది వర్తకుడి కూతురు చిరునవ్వుతో.

"సరే, మీరు తప్పక వినాలంటే, నే చేయగలిగిందేమీ లేదు," అంటూ కమల్ చెప్పడానికి యిష్టంలేనివాడిలా ముఖం అయిష్టంగా పెట్టి, "మీ కుటుంబానికి పెద్ద ఆపద రానున్నట్టు పక్షులు చెబుతున్నవి. దాన్నుంచి బయటపడాలంటే, మీ కుమార్తెను నా కిచ్చి వివాహం చేయాలట!" అన్నాడు.

ఆ జవాబుకు వర్తకుడితోపాటు భార్యా, కుమార్తే విస్తుపోయారు. వర్తకుడు గొంతు సవరించుకుని, "నువ్వు పేదవాడివనే సంగతి వదిలేస్తే, మిగతా అన్నిటా నా కుమార్తెను పెళ్ళాడదగినవాడివే. కాని, ఒకసారి నువ్వు నా అల్లుడివైనాక, నా ఆస్తి కంతకూ వారసుడవని పదిమందికీ తెలిసి పోతుంది. ఆ పరిస్థితుల్లో నువ్వెక్కడ పుట్టావో, ఎక్కడ పెరిగావో—ఆ సంగతులేవీ ఎవరూ పట్టించుకోరు," అన్నాడు.

వర్తకుడి భార్య, భర్త మాటలకు అంగీకారంగా తలాడిస్తూ, "మనుషులు పట్టి అమాయకులు; పక్షులెంత తెలివిగలవి! యీ వివాహం వల్ల మేలు కలుగుతుంది గనక, మనం వెంటనే అమ్మాయి పెళ్ళి చేయడం మంచిది," అన్నది.

ఆ తరవాత కొద్దిరోజులకే కమల్‌కూ, వర్తకుడి కుమార్తెకూ ఎంతో వైభవంగా వివాహం జరిగిపోయింది.






# గుండె వైద్యం

గురవయ్య అనే భూస్వామి గుండె జబ్బుతో మంచాన వుండగా, ఆయన్ని చూసిపోవడానికి, పక్క ఊరిలో వుంటున్న ఆయన మేనల్లుడు సదానందం వచ్చాడు. సదానందం వెంట అతడి స్నేహితుడు చిదానందం కూడా వున్నాడు.

మేనల్లుడు చూడవచ్చినందుకు గురవయ్యకు చాలా సంతోషం కలిగింది. అయినా, ఆయన ఎంతో నీరసంగా, మాట్లాడ లేనిస్థితిలో వున్నాడు. సదానందం ఆయన పరిస్థితి చూసి చాలా జాలిపడ్డాడు.

అతడు మేనమామను పరామర్శించి, ఆయన వ్యాధికి చుట్టుపక్కల బాగా పేరు మోసిన వైద్యుడివల్ల చికిత్స జరుగుతున్నదని తెలుసుకుని తృప్తిపడ్డాడు. అయినా, యింతకాలంగా వ్యాధి తిరుగుముఖం పట్టకపోవడం అతడికి ఆశ్చర్యం కలిగించింది.

అతడు మేనమామకు ఏవేవో సంగతులు చెప్పడం మొదలుపెట్టాడు. గురవయ్య నిశ్శబ్దంగా అతడు చెప్పేవి విన్నాడు.

ఇలా కొంతసేపు జరిగాక గురవయ్య లేని ఓపిక తెచ్చుకుని సదానందాన్ని, ''మీ ఊళ్ళో చంద్రయ్య పొలాలు, యీ సంవత్సరం బాగా పండాయా?'' అని అడిగాడు.

సదానందం ఒక్కక్షణం ఆలోచించి, ''బాగా పండడమా! ఆయన పొలాల్లో పంట వెన్నుపురుగు తినడం వల్ల పూర్తిగా దెబ్బతిని పోయింది. దానితో మనిషి సగం కుంగిపోయాడు. లోగడలాగా సాయంత్రం వేళల్లో పొన్నుకర్ర పట్టుకుని గ్రామం మధ్య రచ్చబండ దగ్గిరకు వచ్చి ప్రతాపాలు పలకడం కూడా పూర్తిగా మానేశాడు,'' అన్నాడు.

కమలిని




"అలాగా!" అంటూ గురవయ్య మంచంలో లేచికూర్చోబోయిన వాడల్లా ఆగి, "అతడి కూతురికి ఆ మధ్య ఏదో జమీందారీ సంబంధం వచ్చిందని ఎవరో చెప్పారు. ఆ మాట నిజమేనా?" అని అడిగాడు.

వెంటనే సదానందం చిన్నగా నవ్వి, "అదేమిటి మామయ్యా! ఆ అమ్మాయికి జమీందారీ సంబంధం రావడం అట్లా వుంచి, అసలు పెళ్ళే అయే యోగం లేదని జ్యోతిష్కులు నిర్మొహమాటంగా చెప్పేశారు. పాపం, చంద్రయ్యకు ఎంత ఆస్తిపాస్తులుంటేనేం, కూతురుకు మాత్రం పెళ్ళిగీత లేదు," అన్నాడు.

ఆ తరవాత గురవయ్య మేనల్లుణ్ణి ఎలాంటి ప్రశ్నలూ అడగలేదు. సదానందం యిచ్చిన యీ సమాధానాలు అతడి స్నేహితుడు చిదానందానికి చాలా ఆశ్చర్యం కలిగించినై. కొంత కాలం కిందట సదానందానికీ, చంద్రయ్యకూ ఏవో మాట పట్టింపులు వచ్చినై. ఆ కోపం మనసులో వుంచుకుని అతడు మేనమామకు అబద్ధాలు చెప్పాడనుకున్నాడు, చిదానందం.

కొంతసేపు గడిచాక స్నేహితులిద్దరూ తమ ఊరుకు తిరుగు ప్రయాణం అయ్యారు. దారిలో చిదానందం, సదానందాన్ని, "అంత జబ్బులో కూడా మీ మేనమామ, ఎక్కడో పొరుగూరులో వున్న ఆసామీ యోగక్షేమాలు విచారించి, తన మంచితనాన్ని బయట పెట్టుకున్నాడు. నువ్వు మాత్రం ఎప్పుడో వచ్చిన మాట పట్టింపు మరిచిపోలేక చంద్రయ్య లాంటి పెద్దమనిషిని గురించి అంత అలక్ష్యంగా మాట్లాడావు. కారణం ఏమిటి?" అని అడిగాడు.

"నీకు తెలియదుకాని, పెద్ద కారణమే వుంది!" అంటూ సదానందం నవ్వి వూరుకున్నాడు.

"ఏమిటా పెద్ద కారణం? చంద్రయ్య పొలాలు విరగపండాయనీ, ఆయన కూతు

రుకు జమీందారు కుటుంబంలోని కుఱ్ఱవాడితో వివాహం నిశ్చయమయిందనీ, నువ్వెరగవా?'' అన్నాడు చిదానందం విసుగ్గా.

''అవన్నీ నే నేం ఎరగనివి కావు. కాని నీకు మా మేనమామ సంగతి అంతగా తెలియదు. అందువల్లే నన్ను అపార్థం చేసుకుంటున్నావు. నేనలా మాట్లాడడం వల్ల, ఆయన జబ్బు త్వరగా నయమయి, కోలుకునే అవకాశం వుంది,'' అన్నాడు సదానందం నవ్వుతూ.

ఆ చెప్పేదేమిటో సూటిగా చెప్పమన్నాడు చిదానందం. అందుకు సదానందం, ''ఈ చుట్టుపక్కల పెద్ద భూస్వాములు మా మేనమామా, చంద్రయ్యేగదా. మా మేనమామ అన్ని విషయాల్లోనూ చంద్రయ్యను తన ప్రత్యర్థిగా భావిస్తాడు. అంత జబ్బులో కూడా ఆయన్ని గురించి అడగడానికి అంతకన్న మరొక కారణం లేదు. చంద్రయ్యను గురించి నిజం చెబితే, మా మేనమామ గుండె ఆగిపోయే ప్రమాదం వుంది. ఆ పాపం నేనెందుకు కట్టుకోవాలి?'' అన్నాడు.

కొద్దిరోజుల తరవాత చిదానందం పనిమీద గురవయ్య వుండే ఊరు వెళ్ళి, ఆయన్ని చూడబోయాడు. ఆ సమయంలో ఆయన తన నౌకర్లతో పొలం పనుల గురించి మాట్లాడుతున్నాడు. మనిషి ఎంతో ఆరోగ్యంగా కనిపించాడు.

చిదానందాన్ని చూస్తూనే గురవయ్య నవ్వుతూ పలకరించి, తన మేనల్లుడి క్షేమసమాచారాలు అడిగి తెలుసుకుని, ''మా వాణ్ణి కొంచెం వీలు చూసుకుని, ఒకసారి రమ్మన్నానని చెప్పు. అసలు లోగడలాగా మీ రిద్దరూ కలిసి వస్తే, ఎంత బావుండేది,'' అన్నాడు.

చిదానందం తిరిగి గ్రామంచేరి, సదానందాన్ని కలుసుకుని, ''నిన్న పనుండి మీ మేనమామగారి వూరు వెళ్ళాను. నీ గుండె వైద్యం మహిమ అనే అనుకుంటాను—ఆయన ఎంతో ఆరోగ్యంగా వున్నాడు,'' అన్నాడు.





# స్త్రీకి ప్రియమైనది

ఒక రాజు ఒకనాడు తన రాణీతోసహా పుష్పవన విహారం చేస్తూండగా, "మహారాజా, స్త్రీకి అన్నిటికన్న ఎక్కువగా ప్రియమైనది ఏమిటో చెప్పండి, చూతాం," అన్నది రాణి.

రాజు చుట్టూ ఉన్న పూలమొక్కలు కలియజూసి, "పూలు," అన్నాడు.

"కాదు," అన్నది రాణి.

ఆడదానికి అన్నిటికన్న ప్రియమైనది భర్త అనీ, పిల్లలనీ, అలంకారాలనీ, చీరెలనీ ఏవేవో చెప్పాడు రాజు. అవేవీ కావన్నది రాణి.

రాణి ప్రశ్నకు సమాధానం తెలుసుకోవాలని రాజుకు తహతహ పుట్టింది. ఆయన వెంటనే చాటింపు వేయించి, స్త్రీకి ప్రియమైనదేదో చెప్పి రాణిగారి చేత ఒప్పించిన వారికి వెయ్యి వరహాలు బహుమాన మిస్తామని ప్రకటన చేశాడు.

మర్నాడు సభకు జనం తూగిడీలుగా వచ్చి, రాణిగారి ప్రశ్నకు సమాధానం చెబుతామన్నారు. సమాధానం రాణిగారికి అంగీకారం కాకపోతే కొరడా దెబ్బలతో శిక్షిస్తానన్నాడు రాజు. దానితో ఒక్కరు కూడా సమాధానం చెప్పకుండా తిరిగి వెళ్ళిపోయారు.

రాజుగారికి కోపం వచ్చి వెంటనే ఇంకో చాటింపు వేయించాడు: మర్నాడు ఉదయం రాజుగారు ఒక పావురాన్ని వదులుతారు; అది వెళ్ళి ఏ ఇంటి పైన వాలితే ఆ యింటిలో ఉండే వాళ్ళలో ఎవడో ఒకడు వచ్చి రాణిగారి ప్రశ్నకు సమాధానం చెప్పాలి; ఆ సమాధానం రాణిగారికి నచ్చకపోతే మరుక్షణమే శిరశ్ఛేదం!

మొదటి చాటింపు విని జనం ఎంత ఉబలాటపడ్డారో ఈ చాటింపు విని

అంతగా బెదిరిపోయారు. రాజు ఇదే విధంగా రోజూ పావురాన్ని వదిలి జవాబు చెప్పలేని ఒక్కొక్క ఇంటివాణ్ణీ శిరశ్ఛేదం చేస్తాడు కాబోలని వారికి భయం పుట్టుకొచ్చింది.

మర్నాడు రాజుగారు వదిలిన పావురం ఎగురుతూ వెళ్ళి, దూరాన ఒక పల్లెవాడి ఇంటి పైన వాలింది. దానివెంట వెళ్ళిన రాజభటులు పల్లెవాడి ఇంట్లో ప్రవేశించి చూస్తే, పల్లెవాడు ఇంట లేడు, వాడి కొడుకు వల అల్లుతున్నాడు. రాజభటులు వాణ్ణి బలవంతంగా పట్టుకుని రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

రాజు వాడికి విషయమంతా చెప్పి, రాణి ప్రశ్న వినిపించి, దానికి వాడు విధిగా సమాధానం చెప్పాలనీ, లేకపోతే వాడి తల తీసేస్తామనీ అన్నాడు.

"పదిహేను రోజులు గడువియ్యండి, సమాధానం చెబుతా," అన్నాడు పల్లెవాడి కొడుకు. రాజు సరేనన్నాడు.

ఆ గడువు కాలమంతా వాడికి కాళ్ళు అరిగేటట్టు తిరగటంలోనే సరిపోయింది. వాడు ఎందరో ఆడవాళ్ళను, "ఆడదానికి అన్నిటికన్న ఏది ఎక్కువ ఇష్టం?" అని అడిగాడు. కొందరు నగలన్నారు, కొందరు పిల్లలన్నారు. కాస్త వయసు మళ్ళినవాళ్ళు మనవలూ, మనవరాళ్ళూ ఇష్టమన్నారు. మొత్తం మీద ఒకరు చెప్పిన సమాధానం ఒకరు చెప్పలేదు. అన్ని సమాధానాలూ, అందరికీ తెలిసినవే.



అలాటి సమాధానం కోసం రాజు ఇంత ఆర్భాటం చేస్తాడా ?

గడువు ఆఖరు రోజున పల్లెవాడి కొడుకు తనకు మర్నాడు చావు తప్పదని నిశ్చయించుకుని, చెరువు గట్టున విచారంగా ఉండగా, ఒక ముసలమ్మ అటుగాపోతూ ఆగి, "ఏం నాయనా, అంత దిగులుగా కూర్చున్నావు ?" అని అడిగింది. వాడా ముసలమ్మతో అంతా చెప్పాడు.

"రాజుగారు చేస్తున్న ఆర్భాటం గురించి నేను కూడా విన్నాలే, నాయనా. అదంతా చూస్తూంటే రాణిగారి ప్రశ్నకు జవాబు తెలుస్తూనే ఉందిగా !" అన్నది ముసలమ్మ.

"ఏమిటవ్వా, ఏమిటా జవాబు ?" అని వాడు ఆత్రంగా అడిగాడు.

"ఇంకేముంది, నాయనా ? మొగుడి పైన అధికారం. రాణీ చూడు ఆ రాజు చేత మూడు చెరువుల నీళ్ళు తాగించి ఎలా ఆనందిస్తున్నదో !" అని ముసలమ్మ కర్ర తాటించుకుంటూ పోయింది.

మర్నాడు రాజభటులు వచ్చి పల్లెవాడి కొడుకును రాజసభకు పట్టుకుపోయారు.

రాజు వాణ్ణి, "అన్నిటికన్న స్త్రీకి అత్యంత ప్రియమైన దేమిటో తెలుసుకున్నావా ?" అని అడిగాడు.

"భర్త పైన అధికారం," అన్నాడు పల్లె కుర్రవాడు.

రాజు ఆ జవాబుకు నిర్ఘాంతపోయి, "నేను నమ్మను," అన్నాడు.

"రాణీగారు ఒక చిన్నప్రశ్నతో మీకెంత పని కలిగించిందో తెలిసి కూడా నమ్మరా ?" అన్నాడు పల్లె కుర్రవాడు.

"వీడి సమాధానం సరయినదేనా ?" అని రాజు రాణీ నడిగాడు.

ఆమె ఏమీ సమాధానం చెప్పకుండా తల వంచుకున్నది.

పల్లెవాడి కొడుకు సమాధానం సరయినదేనని రాజు గ్రహించి, వాడికి రెండు వేల వరహాలు బహుమానం ఇచ్చి పంపేశాడు.





# శ్రమకుతగ్గ ఫలం!

భూషయ్య స్వభావం గురించి రామగిరి గ్రామంలోనే కాకుండా, చుట్టుపక్కల గ్రామాల్లోనూ వింతగా చెప్పుకునేవాళ్ళు. భూషయ్యకు తల్లిదండ్రుల నుంచి లభించింది ఒక ఎకరా మెట్టపొలమే. కాని, ఆయన తలెత్తిన తర్వాత స్వయంకృషితో, ఒక పక్క వ్యవసాయమూ, మరో పక్క వ్యాపారమూ చేసి, కాలం కలిసి రావడంతో, చూస్తుండగానే లక్షాధికారి అనిపించుకున్నాడు. జీవితంలో ఎంతో శ్రమపడి పైకి వచ్చినవాడు కావడంతో, ఆయన డబ్బు విషయంలో చాలా పట్టింపుగా వుండేవాడు. పైగా ప్రతి విషయాన్నీ ఆయన డబ్బుతోనే తూచేవాడు.

భూషయ్య కొడుక్కి పరమేశ్వరపురం జమీందారు కూతురితో పెళ్ళి సంబంధం కుదరడంతో, ఆయన ఎంతో సంతోషించాడు. పెళ్ళి ఏర్పాట్లన్నీ ఘనంగా చేశాడు.

పెళ్ళి బ్రహ్మాండంగా జరిగింది. పెళ్ళిలో పనిపాటులు చేసిన వారందరికీ కానుకలూ, వస్త్రాలూ ఇచ్చి సంతోషపరచాలనుకున్నాడు భూషయ్య.

ఆ విధంగా కానుకలు తీసుకోడానికి మొట్టమొదట అక్కడికి వచ్చినవారు పెళ్ళిలో మంగళ వాయిద్యం వాయించిన బృందం.

మొదట సన్నాయి వాయించిన విద్వాంసుడు, భూషయ్య దగ్గరికి వచ్చాడు. కాని వాణ్ణి చూడగానే, "కొంతసేపు అలా వుండు," అని వారించిన భూషయ్య, దూరంలో నిలబడి వున్న శ్రుతి వేసిన వాణ్ణి రమ్మని చేయి ఊపి, వాడు దగ్గరికి రాగానే, "పాపం, ఊపిరిబిగపట్టి అంత సేపు ఎలా ఊదగలిగావు? నీ శ్రమకు ఎంత ఇచ్చినా తక్కువే!" అంటూ వాడికి వంద రూపాయ లిచ్చాడు.

అంగేరి బాలసుబ్రహ్మణ్యం

ఆ తర్వాత డోలు వాయించిన వాణ్ణి పిలిచి, "ఒళ్ళంతా చెమటలు కక్కేట్టు కష్టపడ్డావు. సంతోషంగా తీసుకో," అంటూ వాడికి నూతన వస్త్రాలతోపాటు డెబ్బై అయిదు రూపాయలు ఇచ్చాడు.

ఆ పిమ్మట తాళం వేసిన వాణ్ణి పిలిచి, "ఒక్క నిమిషం విరామం లేకుండా తాళం వేశావు. నీ కష్టంనాకు వద్దులే," అని యాభై రూపాయలు ఇచ్చాడు భూషయ్య.

ఆఖరికి సన్నాయి వాయించిన వాడికేసి అసంతృప్తిగా చూస్తూ, "పని చేసేప్పుడు ఒళ్ళు దాచుకునే వాళ్ళంటే నాకు పరమ అసహ్యం! అయినా అయిదు నిమిషాలు సన్నాయి వాయిస్తే, పది నిమిషాలు అలా దిక్కులు చూస్తావేమిటి? ఈ లక్షణానికి తోడు, మెడలో బంగారు గొలుసు, వేళ్ళ నిండా ఉంగరాలు! నువు చేసిన పనికి ఇది కూడా దండగే!" అంటూ పాతిక రూపాయలు ఇచ్చాడు.

సన్నాయి విద్వాంసుడు ఆశ్చర్యంతో అలాగే నిలబడిపోయాడు.

పక్కనే వుండి ఇదంతా చూస్తూన్న భూషయ్య వియ్యంకుడు పరమేశ్వరపురం జమీందారు చిన్నగా నవ్వి, భూషయ్యతో, "బావగారు ప్రతిదాన్నీ డబ్బుతో నే తూస్తారని లోగడే విన్నాను. అది మంచిదే కాని, ఆ విలువ కట్టడంలో కేవలం శరీర శ్రమకే ఎక్కువ ప్రాముఖ్యత నివ్వడం సరికాదేమో! మరి ఆ విధంగా చూస్తే, పెళ్ళిలో పల్లకీ మోసిన బోయీలూ మున్నగువారికన్నా, అల్లుడుగారు ఏం కష్టపడ్డారని ఆయనకు పిల్లనివ్వడంతో పాటు, కట్నకానుకలు మొదలైన సకల విధ లాంఛనాలూ సమకూరుస్తున్నాను?" అన్నాడు.

వియ్యంకుడి ఈ ఎత్తి పొడుపుకు గతుక్కుమన్నాడు భూషయ్య. వెంటనే తమాయించుకుని, తనలోని లోపాన్ని గ్రహించిన భూషయ్య, సన్నాయి విద్వాంసుడితో ప్రారంభించి, వాద్యబృందంలో వారి వారి స్థానానికి తగ్గ విధంగా కానుకలిచ్చి సత్కరించాడు.






దశరథమహారాజు పుత్రకామేష్ఠి యాగం చేసి, అగ్నిదేవుడిచ్చిన పాయసపాత్ర అందుకుని, ఆనందపారవశ్యంతో కౌసల్యకు, కైకేయికి ఆ పాయసాన్ని పంచియిచ్చాడు.

అతనికి కౌసల్య, సుమిత్ర, కైకేయి- ముగ్గురు రాణులు.

కౌసల్యాదేవి, సుమిత్రకుగాను తనకిచ్చిన దాట్లోంచి కొంత పాయసాన్ని వేరొక పాత్రలోకి తీసింది. అలాగే కైకేయి కూడా ఆ పాత్రలో తనకిచ్చిన పాయసం నుంచి తీసి కొంతవేసింది.

చైత్రశుద్ధ నవమినాడు కౌసల్యకు విష్ణువు రాముడుగా నీలమేఘం ఛాయగల శరీరకాంతితో పుట్టాడు.

తర్వాత కైకేయికి శంఖపద్మాల అంశతో ముత్యపు తెలుపుగల భరతుడు పుట్టాడు.

శేషుని అంశతో బంగారు వన్నెగల లక్ష్మణుడూ, చక్రగదల అంశతో పగడపు ఎర్రజీరతో శత్రుఘ్నుడూ, సుమిత్రకు పుట్టారు.

చైత్రశుక్లనవమి రామనవమిగా పేరొంది కోసల రాజ్యమంతటా ఆనందోత్సవాలు జరుగుతూండగా మూడో చైత్రం వచ్చింది. అయోధ్యానగరంలో చక్రవర్తి పెద్దకుమారుడి పుట్టినరోజు వేడుకలు, దానధర్మాలు ఘనంగా జరిగాయి.

చైత్రపౌర్ణమినాడు రాజసౌధం మీద విరిసిన వెన్నెట్లో నలుగురు చిరంజీవులతో,

9. రామావతారం



ముగ్గురు రాణులతో దశరథుడూ, మంత్రి సుమంత్రుడూ, రాముణ్ణి ఎత్తుకొని తిప్పి ఆడించే రాజబంధువూ, అంతరంగికుడూ అయిన భద్రుడూ చిత్రాన్నాలతో విందు చేసుకున్నారు.

కౌసల్య రాముణ్ణి ఎత్తుకొని చంద్రుణ్ణి చూపి ఆడిస్తూంటే రాముడు చందమామ కావాలని ఒకటే మారాం పెట్టి ఎన్ని విధాల బుజ్జగించినా ఏడుపు మానలేదు.

అప్పుడు సుమంత్రుడు ఒక అద్దాన్ని తెప్పించి రాముడి ముందుంచి, అందులో చంద్రబింబాన్ని చూపించాడు. రాముడు సంతోషంతో తననూ, చంద్రుణ్ణీ అద్దంలో చూసుకుంటూ, 'రామచంద్రుడు' అని ముద్దు ముద్దుగా అంటూ చిరుచేతులతో చప్పట్లు కొట్టాడు. అది మొదలు రామచంద్రుడు అనిపించుకున్నాడు.

తర్వాత భద్రుడు రాముడిని ఎత్తుకొని అద్దంలోకి చూపిస్తూ, "మరి ఇప్పుడో?" అన్నాడు.

రాముడు, "రామభద్రుడు!" అన్నాడు. ఆ విధంగా రామభద్రుడు అని కూడా అనిపించుకున్నాడు.

పిమ్మట లక్ష్మణ భరత శత్రుఘ్నులు రాముడి పక్కల చేరి అద్దంలో కనిపించారు. పైన నిండుచంద్రబింబం గొడుగు లాగ కనిపించింది. అందరికీ ఆ దృశ్యం రామ పట్టాభిషేకాన్ని స్ఫురింపజేసింది. దశరథుడి ఆనందానికి మేర లేదు. ముగ్గురమ్మలూ మురిసిపోయారు.

రాకుమారులు పెరుగుతున్నారు.

లక్ష్మణుడు ఎల్లప్పుడూ రాముడి వెన్నంటి వుండేవాడు. ఆ వెనుక, భరత శత్రుఘ్నులిద్దరూ జంటగా వుంటూ ఆడుకుంటూ ఒకే ప్రాణంగా వుండేవారు.

అన్న, తమ్ములు నలుగురైనా అంతా ఒకే పరిపూర్ణరూపంగా కనిపిస్తూండేవారు.

రాకుమారులు కులగురువైన వసిష్ఠ మహర్షి దగ్గిర విద్యావంతులైనారు.

రాముడు వయసుకి పిన్న అయినా పెద్దచదువులే చదివాడు; సర్వశాస్త్రాలూ,

వేద వేదాంగాలూ, ధర్మసూక్ష్మాలూ, యోగ రహస్యాలూ తెలుసుకున్నాడు.

వసిష్ఠుడు, "రామచంద్రా! మీ వంశ కర్త సూర్యుడు, నీవు రవి రాముడివి! ఇక్ష్వాకకుల తిలకానివి! నీ ముత్తాత రఘు మహారాజు గొప్ప కీర్తిగాంచిన వాడు. నీవు రఘువంశ సుధాంబుధి చంద్రుడివి! రఘు రాముడివి!" అని పేర్కొంటూ రాముణ్ణి ఆశీర్వదించాడు—అని సూతుడు చెప్పగా, నైమిశారణ్య మునులు, "సూత మునీంద్రా! సూర్యవంశ రాజుల చరిత్ర లను విపులంగా వినగోరుతున్నాము!" అని కోరారు.



సూతుడు చెప్పసాగాడు :

మహాకల్పారంభంతో వివస్వంతుడు అనే పేరున ప్రకాశించిన సూర్యుడికి కుమారుడైన వైవస్వతుడు మనువు అయ్యాడు.

వైవస్వతమనువుకి ఇక్ష్వాకుడు మొద లైనవారు పదిమంది కుమాళ్ళు.

వారందరూ గొప్ప రాజులై ధరణిని ఏలారు. వారిసంతతి బాగా పెరిగింది. ఆ విధంగా సూర్యవంశం శాఖోపశాఖలై విస్తరించింది.

ఇక్ష్వాకుని సంతతివారైన ఇక్ష్వాకుల్లో దిలీపుడు, రఘువు గొప్ప ధర్మపరులైన చక్రవర్తులుగా పేరుపొందారు.

దిలీపమహారాజు సంతాన ప్రాప్తికోసం కులగురువైన వసిష్ఠుని ఆదేశానుసారంగా కామధేనువు అంశ అయిన నందినీ ధేనువును భక్తిశ్రద్ధలతో అర్చిస్తూ, అడ వుల్లో మేపుతూండగా, ఆవు ఒక గుహలోకి వెళ్ళింది. ఆ గుహలో ఒక భయంకర మైన సింహం ఆవును పట్టుకొంది. దిలీ పుడు సింహాన్ని చంపడానికి ధనుస్సుకు బాణం సంధించబోతే, అతని చేయి స్తంభించి అలాగే ఉండిపోయింది.

అప్పుడు సింహం అతనితో, "ఓ రాజా! ఆవు నాకు లభించిన ఆహారం! నన్ను చంపబోవటం అధర్మం కనుకనే, నీ చేయి అలా వుండిపోయింది!" అన్నది.



అది విన్న దిలీపుడు, "నన్ను ఆహారంగా తీసుకొని ఆవును విడిచిపుచ్చు." అని ప్రార్థించాడు. సింహం అదృశ్యమైంది.

నందినీ ధేనువు అతని భక్తికి సంతసించి, ఆ దృశ్యమంతా తాను కల్పించినదే అని చెప్పి సంతానప్రాప్తి కలిగేలా దిలీపుడికి వరమిచ్చి అనుగ్రహించింది.

దిలీపుడి కుమారుడే రఘుమహారాజు. రఘువు గొప్పదానపరుడుగా కీర్తిగాంచాడు. అతిథిగా వచ్చిన తపస్వి మనోవాంఛితాన్ని గ్రహించి, రఘువు తన రాణిని తపస్వి ఆశ్రమానికి తీసుకెళ్ళి దిగబెట్టి వచ్చాడు. తపస్వి తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపం పొంది, ఆమెకు సగౌరవంగా మ్రొక్కి రాజమందిరానికి పంపించాడు.

దానమిచ్చినదాన్ని తిరిగి పరిగ్రహించడానికి రఘువు సమ్మతించలేదు. రాణి తన్ను నరికి చంపమని భర్తను వేడుకొన్నది.

రఘువు ఎత్తిన కత్తి ఆమె మెడ మీద పూలరాశిగా పడింది. రాజదంపతుల మీద దేవతలు పూలవాన కురిపించారు.

రఘు మహారాజు తనది అంటూ ఏదీ మిగుల్చుకోకుండా సంపదనంతనూ దానం చేసినా చాలకపోగా, కుబేరుడి దగ్గిర ధనరాసులు తేవడానికి వెళ్ళాడు.

యక్షులు రఘువు అలకానగరాన్ని చేరకుండా, యక్ష మాయలన్నీ అతనిపై ప్రయోగించి విఫలులయ్యారు. కుబేరుడు రఘు మహారాజుకు సాదరంగా అనేక సంపదలనిచ్చి పంపాడు. రఘువు ఆ ధనాన్నంతనూ అర్థించేవారు మిగలకుండా పంచాడు.

రఘువు కుమారుడు అజుడు. అజ మహారాజు గొప్ప శూరుడు.

స్వయంవరంలో అజుణ్ణి భోజరాజ పుత్రిక ఇందుమతి వరించింది. అజుడు ఇందుమతితో బయలుదేరుతుండగా స్వయంవరానికి వచ్చిన రాజులందరూ ఒక్కుమ్మడిగా విరుచుకుపడ్డారు. అజుడు

వారినందర్నీ ఎదుర్కొని యుద్ధం చేసి గెల్చాడు.

అజుడు ఇందుమతితో ముచ్చటగా ఉద్యానవనంలో విహరిస్తూండగా, ఆకాశ మార్గాన వెళ్తూన్న నారదుడి వీణకు చుట్టిన దేవలోకపు పుష్పమాల జారి గాలితో యెగిరి వచ్చి ఇందుమతి మెడలో పడింది. వెంటనే ఆమె మరణించింది.

అజుడు ప్రియసతి వియోగానికి పరి తపిస్తూండగా, నారదుడు వచ్చి అతణ్ణి ఓదార్చి ఇందుమతి పూర్వవృత్తాంతాన్ని చెప్పాడు :

హరిణి అనే దివ్యాంగన, తృణ బిందుడు చేస్తూన్న తపస్సు భంగపుచ్చ డానికి ఇంద్రుడు పంపగా, ఋషిశాపం వల్ల మనిషిగా పుట్టింది. శాపవిమోచనం కూడా ఋషి చెప్పాడు.

సుర పుష్పమాల పడడంతో ఆమెకు తాను సురకాంతను అనే స్ఫురణ కలిగి మానవ శరీరాన్ని విడిచి, దేవలోకానికి వెళ్ళిపోయింది.

అజుని కుమారుడు దశరథుడు. ఇక్ష్వాకు వంశీయులైన రాజులు దేవత లకు, రాక్షసులకు జరిగే యుద్ధాల్లో దేవ తలకు సహాయంగా వెళ్లేవారు. అలాగే దశరథుడు కూడా ఇంద్రుడికి సహాయంగా శంబరాసురుడి మీదకు యుద్ధానికి



వెళ్ళాడు. దశరథుడితో కైకేయి కూడా రణరంగానికి వెళ్ళింది. ఆ యుద్ధంలో రథచక్రం ఊడిపడకుండా కైకేయి కాపా డింది. దశరథుడు సంతోషించి రెండు వరాలు కోరుకోమన్నాడు. తనకు కావలసి నప్పుడు ఆ రెండు వరాలు కోరుకుంటా ననీ, అప్పుడు యివ్వమనీ కైకేయి చెప్పింది.

దశరథుడు ఒకనాటి చీకటి రాత్రి, పంటపొలాలు పాడుచేసే ఏనుగులను వేటాడ్డానికి వెళ్ళాడు. ఆ చీకటిలో కమండలువుతో నీరు ముంచుకొంటున్న శబ్దాన్ని ఏనుగు నీరు పీల్చుతున్నదని భావించి మునిబాలకుణ్ణి బాణంతో



చంపాడు. ఆ బాలుడు పెట్టిన కేకతో నిజం తెలుసుకొని దశరథుడు నీరు తీసుకెళ్ళి, అంధులైన బాలుడి తలిదండ్రుల దప్పిక తీర్చాక జరిగింది చెప్పాడు.

ఆ మునిదంపతులు పుత్రశోకంతో, ''నువ్వూ, మాలాగే కుమారుణ్ణి తలంచుకొంటూనే ప్రాణాలు విడిచెదవు గాక!'' అని దశరథుణ్ణి శపించి ప్రాణాలు విడిచారు.

సూర్యవంశపు రాజుల్లో శరణాగత రక్షణకు శిబిచక్రవర్తి కీర్తిగాంచాడు. శిబిని పరీక్షించడానికి ఇంద్రుడు పావురంగానూ, అగ్ని డేగగానూ వెంట తరుముతూ వచ్చాడు. పావురం శిబి తొడమీద వాలింది. పావురం బరువు మాంసాన్ని తన శరీరం నుండి తీసుకోమని శిబి డేగకు చెప్పాడు.

శిబి తన శరీరాన్ని ఎంత కోసి త్రాసులో వేసినా పావురంతో సరితూగలేదు. అప్పుడు శిబి తన్ను పూర్తిగా తీసుకోమని త్రాసు సిబ్బెలో కూర్చున్నాడు.

ఇంద్రుడూ, అగ్ని నిజరూపాలతో కనిపించి శిబికి అనేక వరాలిచ్చి మెచ్చుకొన్నారు.

వసిష్ఠుడితో పోటీపడి గొప్ప తపోబలంతో, వసిష్ఠుడితో సమానంగా మహర్షిగా గుర్తింపు పొందిన విశ్వామిత్రుడు కూడా సూర్యవంశపు రాజే!

సూర్యవంశజుడు, ఇక్ష్వాకులకు చెందినవాడే అయిన అంబరీషుడు గొప్ప రాజర్షి, పరమ విష్ణుభక్తుడైన రాజు.

అంబరీషుకి లక్ష్మి తన అంశతో కుమార్తెగా పుట్టింది. ఆమె పేరు శ్రీమతి.

శ్రీమతి చిన్నతనం నుంచే విష్ణువును తన భర్తగా భావించి ఆరాధిస్తూ వచ్చింది.

శ్రీమతి సౌందర్యం ముల్లోకాల్లో చెప్పుకోబడింది.

నారదుడు తాను మాయాతీతుడననే అహంతో పర్వతుడనే మహామునితో ప్రగల్భాలు పలికాడు. పర్వతుడు కూడా నారదుడితో కలిసి త్రిలోక సంచారం చేస్తూండేవాడు.

నారదుడు పర్వతుడు కలిసి అంబరీషుడి దగ్గరకు వెళ్ళారు. అంబరీషుడు వారిని పూజించి, కుమార్తె శ్రీమతి చేత మునులిద్దరి పాదాలకు మ్రొక్కించి ఆశీర్వదించమన్నాడు.

విష్ణుమాయా ప్రభావం నారద, పర్వతుల్ని ఆవరించింది. శ్రీమతిని చూసి మైమరచి నాకంటే నాకు శ్రీమతితో వివాహం జరిపించమని అంబరీషుణ్ణి కోరారు. శ్రీమతి నాది అంటే నాది అని ఇద్దరూ వాదులాడుకోసాగారు. వెంటనే తమతో వివాహం నిశ్చయం చేయమని అంబరీషుణ్ణి ఒత్తిడి చేశారు.

అంబరీషుడు మునుల వాలకానికి దిగ్భ్రాంతుడై నోటమాట రాకుండా ఉండిపోయాడు. శ్రీమతి తనకు స్వయంవరం ఏర్పాటు చేయమని తండ్రితో చెప్పింది.

అంబరీషుడు నారద, పర్వతులతో, "మీ ఇద్దరికిద్దరూ మహర్షి శ్రేష్ఠులే! మీ ఇద్దరూ నన్ను ఇరుకులో పెట్టడం భావ్యంకాదు గనుక, నా కుమార్తెకు స్వయంవరం చాటిస్తున్నాను. స్వయంవరానికి మీరిద్దరూ రావలసిందిగా ప్రార్థిస్తున్నాను!" అని చెప్పాడు.

చిన్నముఖాలు వేసుకొని మునులిద్దరూ వెళ్ళిపోయారు.

శ్రీమతిని ఎలాగైనా తనదిగా చేసుకోవాలని నారదుడికి ఊహలమీద ఊహలు, ఉపాయాలమీద ఉపాయాలు తోచాయి. నారదుడిని శ్రీమతి వరించకుండా ఉంటే చాలు అని పర్వతుడు తీవ్రంగా ఆలోచించ సాగాడు.

నారదుడు విష్ణువు దగ్గరికి వెళ్ళి మణికిరీటము, కౌస్తుభమణి, వైజయంతీ మాల మొదలైన విష్ణువేషాన్ని తనకు ఇవ్వమని అడిగాడు. విష్ణువు తన రూపాన్ని అలాగే నారదుడికి ఇచ్చాడు.

నారదుడు వెళ్ళాక పర్వతుడు వచ్చి విష్ణువును స్తుతించి, స్వయంవరంలో నారదుడి ముఖం కోతిముఖంగా మారేలాగ చేయమని కోరాడు. విష్ణువు సరే అని చెప్పాడు.





# ఇల్లాలి బాధ్యత

అహల్య వంటపని ముగించి గదినుంచి బయటికి వస్తూండగా, వీధి తలుపు చప్పుడయింది. భర్త శేషగిరి వచ్చాడనుకుని ఆమె గబగబా వెళ్ళి తలుపు తెరిచింది. కాని, ఆ వచ్చింది వెనకవైపు ఇంట్లో వుండే, తాయారు.

''వంటపని అయిపోయింది. ఏమీ తోచక కాలక్షేపానికి యిలా వచ్చాను,'' అన్నది తాయారు.

అహల్య భర్త పని మీద పట్నం వెళ్ళి, రెండు రోజులయింది. బిక్కుబిక్కుమంటూ వున్న ఆమెకు తాయారు రాక ఆనందం కలిగించింది. తాయారు మంచి మాటకారి.

ఆడవాళ్ళిద్దరూ మధ్య గదిలో చాప పరుచుకుని కూర్చుని, చాలా సేపు ఆ కబురూ, యీ కబురూ చెప్పుకున్నారు. చీకటి పడి అహల్య దీపం వెలిగించాక, తాయారు మెడలోంచి హారం తీసి ఆమె చేతికిచ్చింది.

''దీన్ని మా ఆయన పట్నంలో ప్రత్యేకంగా చేయించి తెచ్చారు. ఎలా వున్నదంటావు?'' అని అడిగింది, తాయారు.

ఎర్రరాళ్ళ హారం దీపపు కాంతిలో మెరిసిపోతున్నది. అహల్య దాన్ని అటూ, యిటూ తిప్పి చూసి, ''హారం కొత్త నమూనాలో, చాలా బావుంది,'' అన్నది సంతోషంగా.

తాయారు కొంచెం ఆగి హారం కోసం చేయి చాపేసరికి, అహల్య, ''పట్నంలో వెళ్ళిన పని అయితే, మా ఆయన గాజులు చేయిస్తానన్నారు. రాత్రికి ఆయన తిరిగి రావచ్చు. గాజులకు బదులు యిలాంటి హారం చేయించమంటాను. ఈ పూటకు దీన్ని, నా దగ్గిర వుంచు, తెల్లవారి యిస్తాను,'' అన్నది.

మాచిరాజు కామేశ్వరరావు



తాయారు సరేనని తన ఇంటికి వెళ్ళిపోయింది. అహల్య హారాన్ని పెట్టెలో దాచి; భర్త కోసం చాలా సేపు ఎదురు చూసి, ఒక్కతే భోజనం చేసి, తలుపులన్నీ మూసి పడుకున్నది.

తెల్లవారుతూనే నిద్రలేచిన అహల్య, పెరటిగది తలుపు తెరిచి వుండడం చూసి అదిరిపడింది. గదిలో ఆమె పెట్టెలోని బట్టలన్నీ చిందరవందరగా కిందపడి వున్నాయి. పెట్టెలో వుండవలసిన ఆమె కమ్మలూ, వంద రూపాయిలూ, తాయారు హారం లేవు. దొంగ ఉపాయంగా బయిటి నుంచి పెరటి తలుపు గడి తీసి లోపల ప్రవేశించాడు.

అహల్య ఇరుగు పొరుగు ఇళ్లవాళ్లను పిలిచి జరిగింది చెప్పింది. అంతా ఆమె పట్ల సానుభూతి కనబరిచారు. తాయారు ఆమెను కొంచెం పక్కకు తీసుకుపోయి, "నా హారం భద్రంగా వుందిగదా?" అని అదుర్దాగా అడిగింది.

అహల్య కళ్ళనీళ్ళు తిరుగుతూండగా, "అదీ పోయింది!" అన్నది.

"కొంప మునిగింది. హారం నీకిచ్చాననీ, అది పోయిందనీ తెలిస్తే, మా ఆయన నన్ను బతకనియ్యడు!" అంటూ తాయారు ఏడ్పుముఖం పెట్టింది.

"తాయారూ, యిప్పుడేం గొడవ పెట్టకు. మా ఆయన వచ్చాక, అంతా సర్దుబాటయేలా చూస్తాను," అన్నది అహల్య.

"రెండు రోజుల్లో, మా ఆడపడుచు పెళ్ళి. ఆ రోజుకు హారం కావాలి. రెండు వేల ఖరీదు చేసే హారం!" అంటూ తాయారు వెళ్ళిపోయింది.

ఆ తరవాత కొంత సేపటికి అహల్య భర్త శేషగిరి పట్నంనుంచి తిరిగి వస్తూనే, "ఏమిటీ గొడవంతా?" అంటూ చిరాకు పడ్డాడు.

అహల్య అతడికి తాయారు హారం సంగతి వదిలి, రాత్రి దొంగ ఎత్తుకుపోయిన తన కమ్మలూ, వంద రూపాయలను గురించి చెప్పింది.

శేషగిరి కోపంగా, "ఎంత పని జరిగింది! అంత మొద్దు నిద్రేమిటి ?" అన్నాడు.

ఆ మాటలతో అహల్యకూ కోపం వచ్చి, "నువ్వు రోజులు తరబడి ఇంట్లో వుండకపోవడంతో, ఈ ఘోరం జరిగింది! ఎవడో దొంగపీనుగ, నేను ఒంటరిగా వుంటానని కనిపెట్టి, ఈ పని చేశాడు," అన్నది.

శేషగిరి మరి భార్యనేమీ కోపగించుకో లేదు. ఆ సాయంత్రం అహల్య, భర్తకు పోయిన తాయారు హారం గురించి చెప్పి, "రెండు రోజుల్లో తాయారుకు ఎలాగైనా సరే అలాంటి హారమే చేయించి యివ్వాలి; లేకపోతే మన మర్యాద దక్కదు," అన్నది.

"తాయారు భర్త పరమ పిసినారి. అతను భార్యకు రెండు వేల ఖరీదు చేసే హారం చేయించాడంటే, నేను నమ్మను. అది పూత బంగారపుదయి వుంటుంది. అటువంటి నగలు పట్నంలో కోకొల్లలు. పది రూపాయిలు పారేసి అటువంటి దొకటి తెస్తాను," అని పట్నం బయలు దేరాడు, శేషగిరి.

అప్పటికి గండం గడుస్తుందనీ, తరవాత భర్తకు నచ్చ చెప్పవచ్చనీ పూరుకున్నది అహల్య.



ఆ సాయంత్రం ఎర్రరాళ్ళ పూత బంగారం హారంతో తిరిగి వచ్చాడు, శేషగిరి. అది అచ్చు బంగారు హారం లాగే వున్నది. అహల్యకు తల మీది నుంచి పెద్ద బరువు దిగిపోయినట్టయింది. ఆమె హారం తీసుకుని అప్పటికప్పుడే, తాయారు ఇంటికి వెళ్ళింది.

తాయారు హారాన్ని చూస్తూనే, "ఇది నా హారమే! పోయిన సొత్తు దొరకడం, ఈ రోజుల్లో పోయిన ప్రాణం తిరిగివచ్చి నంత విడ్డూరం," అన్నది ఆశ్చర్యంగా.

అహల్య చిన్నగా నవ్వి, "ఇది, నీ అసలు హారం కాదు. నకిలీది! పట్నం నుంచి మా ఆయన పది రూపాయిలకు



కొని తెచ్చాడు. దీనితో ప్రస్తుతానికి, నీ అడబడుచు పెళ్ళి అవసరం గడుస్తుంది. తరవాత మెల్లిగా మా ఆయనకు నచ్చజెప్పి, ఇటువంటిదే బంగారు హారం చేయిస్తాను, నా మాట నమ్ము,'' అన్నది.

తాయారు హారాన్ని మెడలో వేసుకుంటూ, ''ఇది, నా అసలు హారమే! నువ్వే అసలుకూ, నకలుకూ తేడా తెలుసుకోలేకపోతున్నావు. నీ భర్త అసలు రూపం నువ్వు తెలుసుకోవాలని నీతో కొంత కఠినంగా ప్రవర్తించాను,'' అన్నది.

తాయారు మాటలు బోధపడక అహల్య, ఆమె కేసి వింతగా చూసింది. తాయారు జరిగిందేమిటో ఆమెకు వివరించింది.

ఒక రాత్రివేళ బయట ఏదో అలికిడి కాగా తాయారు కిటికీలోంచి పెరట్లోకి చూసింది. అక్కడ శేషగిరి తచ్చాడుతూండటం కంటబడగానే ఆమె ఆశ్చర్యపోయింది. తెల్లవారి దొంగతనం మాట వింటూనే దొంగ ఎవరైందీ, ఆమె తేలిగ్గా ఊహించ గలిగింది.

శేషగిరికి పట్నంలో పని జూదం తప్ప మరొకటి కాదని, తాయారుకు తెలుసు. ఆమె భర్త పట్నంలో జూదమాడుతున్న శేషగిరిని చాలా సార్లు చూశాడు. భర్త తెచ్చిన ఎర్ర రాళ్ళహారం పూతబంగారపుదని, ఆమె మొదట్లో ఎరగదు. ఆమెకు బంగారం నాణ్యం తెలుస్తుందో లేదో చూద్దాం అని, ఆమె భర్త హారం రెండు వేలని చెప్పాడు.

హారం పోయిందని తాయారు చెప్పాక అతను, ''పోతే పోయిందిలే!'' అని అసలు సంగతి భార్యకు చెప్పాడు.

''అహల్యా, జరిగిందిది! ఈ దొంగతనం ఆసరాగా, నీ భర్త అసలు రూపం నీకు తెలిసేలా చేయాలని, చిన్న నాటకం ఆడాను. ఎర్రరాళ్ళ హారాలన్నీ, ఒకే మూసలో పోతపోసినట్టు, యిలాగే వుంటాయా? నీ భర్త, యీ హారాన్ని ముందే చూసినవాడిలా తెచ్చినప్పుడయినా, నీకు అనుమానం కలగలేదా?

ఇప్పటికయినా జాగ్రత్తపడు. జూదంలో డబ్బు పోగొట్టుకుని, అప్పులపాలై, సొంత ఇంట్లోనే దొంగతనం చేసే దశకు దిగజారి పోయాడు, నీ భర్త," అన్నది తాయారు.

అహల్య కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, "తాయారూ, నా కళ్ళు తెరిపించి, పుణ్యం కట్టుకున్నావు. నీ మేలెన్నటికీ మరిచి పోలేను," అని, తాయారుకు తన కృతజ్ఞత చెప్పుకుని, తమ ఇంటికి తిరిగివచ్చింది.

శేషగిరి భార్య రావడం చూస్తూనే, "తాయారు హారం చూసి ఏమన్నది?" అని అడిగాడు.

అహల్య జవాబేమీ యివ్వకుండా, పెట్టెలో చీరలూ అవీ సర్దుకోసాగింది.

శేషగిరి అది చూసి తెల్లబోతూ, "ఎక్కడికిప్రయాణం?" అని అడిగాడు.

"మా పుట్టింటికి! జూదరికీ, దొంగకూ భార్య నవడం, నా దురదృష్టం. అలాంటి వాళ్ళకు పదిమందిలో వుండే గౌరవమర్యాదలు నేనెరగనిదాన్ని కాను," అన్నది అహల్య చీదరింపుగా.

శేషగిరి నిలువునా చలించిపోయాడు. అతడు భార్య ముందుకు వచ్చి, ఎంతో దీనంగా, "నన్ను క్షమించు, అహల్యా! జూదం అనేది ఎంత ప్రమాదకరమైన జబ్బో, అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. ఇక జన్మలో జూదం పేరుతో పట్నం మొహం చూస్తే ఒట్టు!" అంటూ భార్య చేతులు రెండూ పట్టుకున్నాడు.

భర్త మాటలలోని నిజాయితీ గుర్తించిన అహల్య, "జూదాలద్వారా, దొంగతనాలద్వారా సంపాదించిన డబ్బుతో సుఖం వుండదు. మనం, మీ ఉద్యోగం వల్ల వచ్చే జీతం డబ్బుతో సుఖంగా జీవించవచ్చు," అంటూ పెట్టెను యథాస్థానంలో పెట్టేసింది.

"నీలాంటి ఉత్తమురాలు భార్యగా దొరకడం, నా అదృష్టం!" అన్నాడు శేషగిరి ఎంతో సంతోషపడిపోతూ.

"భర్త తప్పుదారి పట్టినప్పుడు, సరి అయిన దారికి వచ్చేలా చేయడం, ఇల్లాలి బాధ్యతగదా," అన్నది అహల్య నవ్వుతూ.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



Madana Gopal

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: భయపెట్టే ఆట

రెండవ ఫోటో: బతుకంతా వేట

పంపినవారు: పి. డింపుల్ సౌజన్య, తిరుపతి-517 501

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు:

1. మెగస్తనీస్, చంద్రగుప్తమౌర్యుని ఆస్థానానికి అతణ్ణి రాయబారిగా పంపిన గ్రీకు చక్రవర్తి-సెల్యూకస్ నికెటర్. 2. సైరస్ (క్రీ. పూ. 558-530) 3. డేరియస్ (క్రీ. పూ. 522-486) 4. పాండిచ్చేరికి దక్షిణంగా వున్న సెయింట్ డేవిడ్ కోట; చెన్నపట్నంలోని సెయింట్ జార్జ్ కోట 5. నెపోలియన్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) ... Controlling Editor: NAGI REDDI.

# న్యూట్రమూల్ శక్తి.
## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రమూల్. సమృద్ధి అయిన అమూల్ పాలు. ఎంచిన మాల్ట్. ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు. పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి. కేవలం న్యూట్రమూల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.



మరింత పొడుగ్గా,
బలంగా, పుష్టిగా అవటం ఎలా?
కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక
To: Nutramul, P.O. Box 10146, Bombay 400 001. IT

ప్రియమైన న్యూట్రమూల్,
దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజి స్టాంపులూ, న్యూట్రమూల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ______ (పెద్ద అక్షరాలలో)
అడ్రసు ______

IS : 1806

ISI

గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
388 001

DaCunha/GCMMF/TL/82

# జీవన్ మరియు హను

## మాట్లాడే జంతువులను గూర్చి చెబుతున్నారు

అగ్గి చీమలు (ఫైర్ ఏంట్స్) ప్రత్యేకమైన గ్రంథుల ద్వారా వేర్వేరు వాసనలతో భావాన్ని వ్యక్తంచేస్తాయి. మెల్లిగా తగ్గిపోయే వాసన ద్వారా ఆహారం ఆ దారిలో వుందని చెబుతాయి. త్వరగా తగ్గిపోయే వాసనలతో అపాయం రాబోతోందని సూచిస్తాయి. మరొక వాసన ద్వారా ఒక అగ్గి చీమ మరొక అగ్గి చీమను సమూహంలో గుర్తిస్తుంది. ఇంకా మరొక వాసన ద్వారా అందరూ సమావేశం





కావాలన్న సూచన-అపాయపు సూచన లేకుండా.

రక్త పింజర పురుగులు, (ఫ్లీస్). మనుషులకు వినిపించనంత ఎత్తులో శబ్ద తరంగాలు పంపించడం ద్వారా మాట్లాడతాయి. వాటి కడుపులోని గాలి తిత్తులను సన్నగానూ, వెడల్పుగానూ తెరవడం ద్వారా, తద్వారా శబ్దం యొక్క హెచ్చుతగ్గులను సూచిస్తూ (ఈల వెయ్యడంలాగ) భావ వ్యక్తంచేస్తాయి. వీపు భాగంపైన గల సున్నితమైన జుట్టు యీ శబ్దాల్ని గ్రహిస్తాయి-సాధారణంగా యివి, విందుకు రమ్మనో లేదా కొత్తగా కనుకున్న ఆహారపు వసతిని గూర్చి చెప్పడానికో అవుతుంది.

షుమారు 2,000కు పైగా మెరిసే నల్లులు (లైటెనింగ్ బగ్స్) ఉన్నాయి-వేర్వేరు రకాల వెలుగును పంపే పెంకు పురుగులు (బీటిల్స్) లాంటివి. వీటిలో గల ప్రత్యేకమైన నరాలు మెరిసే ఒక రసాయనిక ద్రవ్యాన్ని విడుస్తాయి. ఈ



వెలుగు దీపాలు ·కలయిక'కు రమ్మని పిలిచే సూచనలు. ఈ 2,000 జాతులలో ప్రతి దానిలో ఒక ప్రత్యేకమైన ·వెలుగు భాష' వుంది, గజిబిజి లేకుండా.

అవి చిమ్మే వెలుగుతో శత్రువులను చెదర గొడతాయి గూడాను. చాకు చేపలు (నైఫ్‌ఫిష్) తమ చుట్టూరాగల ప్రాంతంలో విద్యుత్తును ప్రసరింపజేస్తాయి. ఇతర చాకు చేపలు యీ విద్యుత్తు ప్రసారాన్ని శబ్దంగా గ్రహిస్తాయి-సంక్లిష్టమైన స్వరాలుగా, నిర్దిష్టమైన లయ రూపాలుగా. ఈ సంగీత సాంకేతిక భాష ఏమిటోనని శాస్త్రజ్ఞులు అర్థంచేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.





జీవిత భీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోవడానికి అతి భద్రమైన మార్గం



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా



1983 WORLD COMMUNICATIONS YEAR

